# రామ్ శ్యామ్‌లను బంధించారు!




























# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

కొందరు జరగబోయేది తెలుసుకోగోరుతారు. కొందరు జరగబోయేది చెప్పగల మంటారు. అలాటి వారిలో కొందరు జ్యోతిష్కులు. మరి కొందరి నోటి మాట జరిగితీరుతుంది. ముందు జరగబోయేది తమకు నచ్చనప్పుడు కొందరు దాన్ని తప్పించుకోవటానికి చాలా ప్రయత్నాలుచేస్తారు. ఒక్కొక్కసారి ఈ ప్రయత్నాల ఫలితంగానే తాము పడరాదనుకున్న గోతిలో పడతారు. అలాటి సంఘటన ''విధి వంచితుడు'' [ బేతాళ కథ ] లో చూస్తాం.

సంపుటి 56 జనవరి'75 సంచిక 1





# మిత్రభేదం

## 19

"మర్నాడు జాలర్లు వచ్చి, వలలు వేసి, మడుగులోని చేపలన్నిటినీ పట్టేశారు. ప్రత్యుత్పన్నమతి యుక్తిగా చచ్చినట్టు పడి ఉన్నది. దాన్ని చూసిన జాలర్లు, 'ఈ చేప చచ్చింది. దీన్ని ఒడ్డున ఉంచి, మిగిలిన చేపలన్నీ చచ్చినాక వాటితో పాటు పట్టుకుపోదాం.' అనుకున్నారు. వాళ్ళు తనను ఒడ్డు మీద ఉంచిన మీదట ప్రత్యుత్పన్నమతి చల్లగా తిరిగి నీటిలోకి జారుకున్నది. యద్భవిష్యతి మాత్రం వలలో తన్నుకుంటూ ఉండగా జాలర్లు దాన్ని చంపేసి, మిగతా చిన్న చేపలతో బాటు పట్టుకుపోయారు.''

తన భార్య చెప్పిన చేపల కథ విని మగ ఉల్లంకి పిట్ట, ''నేను యద్భవిష్యతి లాటి వాణ్ణి అనుకున్నావా? నేను ముందు ఆలోచించి, నా యుక్తులన్నీ వేసుకుని మరీ ఏ పనైనా చేస్తాను. నేనుండగా నీకు వచ్చిన భయం ఏమీ లేదు,'' అన్నది.

దాని మాట నమ్మి ఆడపిట్ట సముద్రం ఒడ్డున గుడ్లు పెట్టింది.

ఆడ ఉల్లంకి పిట్ట సముద్ర తీరాన గుడ్లు పెట్టక పూర్వం పక్షి దంపతుల మధ్య నడిచిన సంభాషణ అంతా సముద్రం విన్నది; విని, ''ఈ మగపిట్టకు ఇంత పొగరా? దీనికి గట్టిగా బుద్ధి చెప్పాలి,'' అనుకున్నది.

మర్నాడు ఉల్లంకి దంపతులు రెండూ ఆహారం కోసం వెళ్ళినప్పుడు, సముద్రం పెద్ద కెరటాన్ని పంపి, గుడ్లను లాగేసుకున్నది. పిట్టలు తిరిగి వచ్చేసరికి గుడ్లు లేవు.

ఆడ పిట్ట మగ పిట్టతో, ''మన గుడ్లు ఏమయాయో చూడు. నువు యద్భవిష్యతి

లాగే కోరి కీడు తెచ్చావు. పిల్లలను పోగొట్టుకుని జీవించలేను; మంటలలో పడి ఆత్మహత్య చేసుకుంటాను,'' అన్నది.

''నువు తొందరపడి అఘాయిత్యం చెయ్యకు. ఈ సముద్రాన్ని ఎండ గట్టి, నా తడాఖా చూపుతాను," అన్నది మగ ఉల్లంకి పిట్ట.

''రెక్కల పురుగు జ్వాలతో పోరాడి నట్టే ఉంటుంది నువు సముద్రంతో పోరా డటం,'' అన్నది ఆడపిట్ట.

"అలా అనకు. నా ముక్కుతో సము ద్రంలోని నీరంతా లాగేసి ఇసుక పర్ర మిగిలేటట్టు చేస్తాను,'' అన్నది మగపిట్ట.

''నీ ముక్కులో ఒక్క నీటి చుక్క కన్న పట్టదుగదా! గంగా సింధుల లాటి అరువేల నదులూ, డెబ్భైఅయిదువేల ఉపనదులూ వచ్చి అనుక్షణమూ కలిసే సముద్రాన్ని ఎలా ఎండగట్టుతావు?'' అన్నది ఆడపిట్ట.

''ఎందుకీ నిరుత్సాహపు మాటలు? దీక్షతోనూ, మనో నిబ్బరంతోనూ పూనిక చేస్తే సాధించలేనిదంటూ ఉంటుందా?'' అని మగపిట్ట అడిగింది.

''కనీసం మిగిలిన పక్షులన్నిటి సహ కారమూ సంపాదించు. ఒక్కరివల్ల కాని పని పది మందివల్ల అవుతుంది. ఒక్క తాడు ఎన్నడూ ఏనుగును బంధించ



లేదు; కాని నూరు పేటల తాళ్ళతో పేనిన మోకు ఏనుగును సులభంగా నిగ్ర హిస్తుంది. వడ్రంగి పిట్టా, పిచ్చుకా, కప్పా, మేకా ఏకమై ఏనుగును మట్టు బెట్టాయి కావా?" అన్నది ఆడపిట్ట.

''ఏమిటా కథ?'' అని మగపిట్ట అడి గింది. ఆడపిట్ట ఇలా చెప్పింది:

పిచ్చుకా — ఏనుగూ

ఒక అరణ్యంలో ఒక పెద్ద చెట్టు కొమ్మ మీద గూడు కట్టుకుని ఒక పిచ్చుకల జంట నివసిస్తూ ఉండేది. ఆడపిచ్చుక అప్పుడే గుడ్లు పెట్టింది. ఆ మర్నాడు ఒక ఏనుగు అటుగా పోతూ, మధ్యాన్నపు ఎండకు తట్టుకోలేక, ఆ చెట్టు నీడన

నిలిచి, ఆకతాయితనం కొద్దీ చెట్టు కొమ్మ విరిచింది. ఆ కొమ్మ మీదనే పిచ్చుకల గూడు ఉన్నది. ఆ గూట్లో ఉన్న గుడ్లన్నీ కిందపడి పగిలిపోయాయి. అదృష్టవశాన పిచ్చుకల జంటకు చావు తప్పింది.

గుడ్లు నాశనమయినందుకు ఆడ పిచ్చుక మహా శోకించింది. దాని శోకాలు విని, పొరుగున ఉంటున్న దాని స్నేహితురాలు వడ్రంగిపిట్ట వచ్చి, శోక కారణం తెలుసుకుని, "పిచ్చిదానా, ఏడ్చి లాభమేమిటి? గతించిన దానికి బుద్ధిమంతులు శోకించరు. చచ్చిపోయిన వాళ్ళ కోసం ఏడవటం రెట్టింపు బాధ. చేతనైనమటుకు వారి చావుకు ప్రతీకారం చెయ్యాలి," అన్నది.

దానికి ఆడపిచ్చుక, "అదంతా నిజమే. కాని ఈ దుర్మార్గపు ఏనుగు కేవలమూ పొగరుబోతుతనంతో నా బిడ్డల ప్రాణాలు తీసింది. నీవు నిజమైన స్నేహితురాలివైతే, ఈ రాకాసి ఏనుగును చంపే ఉపాయం ఆలోచించు," అన్నది.

"మనకు ఆపత్సమయంలో ఆదుకున్నవాడే మిత్రుడు. కలిగిన వేళ అందరూ మిత్రులే. కలిసి రాని కాలంలో అండగా నిలిచినవాడే హితుడు; తిండి పెట్టినవాడే తండ్రి; నమ్మినవాడే మిత్రుడు; సుఖ పెట్టినదే భార్య. నా స్నేహం ఎలాటిదో త్వరలో చూపుతాను. వీణారవం అనే నా తుమ్మెద స్నేహితురాలిని తెస్తాను. ఏనుగును చంపే మార్గం అది చెబుతుంది," అన్నది వడ్రంగిపిట్ట.

ఆడపిచ్చుకను వెంటబెట్టుకుని వడ్రంగిపిట్ట తుమ్మెద వద్దకు వెళ్ళి, జరిగిన అన్యాయం చెప్పి, "ఏనుగును చంపే ఉపాయం నువు చెప్పాలి," అన్నది.

"అయ్యో, పాపం! ఈమెకు ఇంత కష్టం కలిగిందా? మేఘదూత అనే కప్ప నాకు మంచి స్నేహితుడు. అతనితో కూడా సంప్రదించుదాం. శ్రేయోభిలాషులనూ, సజ్జనులనూ, రాజనీతి తెలిసిన వాళ్లనూ, విజ్ఞానులనూ సంప్రదించి చేసే పనులు ఫలిస్తాయంటారు," అన్నది తుమ్మెద.





# 7

[రాత్రివేళ అరణ్యంలో ఒక చెట్టు మీద ఉదయనుడూ, సంధ్యా నిద్రపోతూ వుండగా, వాళ్ళను బారెడు గడ్డపు జానెడు మనిషి ఒకడు, బందీలుగా పట్టుకుని, తన ఇంటికి తీసుకు పోయాడు. నిశీధుడు తన సోదరులను వెతుక్కుంటూ పోయి, గడ్డపువాడి మెడలోని దండ రహస్యాన్నీ, అతడు వాడే భస్మాల కిటుకునూ కొంతవరకు తెలుసుకున్నాడు. తరవాత—]

సంధ్యకూ, నిశీధుడికీ పగటివేళ ఏమీ కనిపించదు గదా? దానికితోడు ఇప్పుడు గడ్డపువాడు, వాళ్ళిద్దర్నీ ఏదో భస్మం చల్లి మాయం చేశాడాయె! ఆ మాయవల్ల ఉదయనుడు జానెడు మనిషిగా మారి పోవటమూ, మంచంపై పడుకొని వున్న గడ్డం వాడు మామూలు మనిషి కావ టమూ, వాళ్ళు తెలుసుకోలేక పోయారు. గడ్డంవాడు ఏ క్షణాన లేస్తాడో, లేచి యింకేమి ప్రమాదం తెచ్చి పెడతాడో అని బేజారెత్తిపోయారు. పైగా, తమ సోదరు డేమయాడో అనే బెంగ!

గడ్డంవాడి కిటుకు తనకు తెలిసి పోవ టమేగాక, వాడిని మోసం చేసి, తను కూడా వాడిలా మారిపోయాను కదా అని ఉదయనుడు సంతోషించాడు. ఈ సంతో షంలో ఉదయనుడు తన సోదరుల సంగతే మరిచపోయాడు. ఇప్పుడు ఉద



యనుడి దృష్టి అంతా తన జేబులలో వున్న భస్మాలపైనే వుంది. ఈ భస్మాలూ, అంజనాలూ ఎందుకు ఉపయోగపడతయ్యా అని ఆలోచిస్తూ వుండగా, యాదాలాపంగా సోదరుల సంగతి గుర్తుకు వచ్చింది. చూచాడు, ఏరీ వాళ్ళు?

ఉదయనుడికి ఏమీ పాలుపోయింది కాదు. ఏమి చెయ్యటానికీ తోచక అలాగే పచార్లు చేస్తుండగా, మెలకువ వచ్చి గడ్డపువాడు లేచాడు. ఎదుట అచ్చుగా తన స్వరూపంతోనే, ఒక చెయ్యి లేని ఉదయనుడు కనిపించేసరికి, గడ్డపువాడికి అంతా అర్థం అయిపోయింది. తన బండారం బయటపడిందే అని లోలోపల మండిపోతున్నా, పైకి మాత్రం కొంచెం కూడా కోపం కనబరచలేదు.

వాడు నెమ్మదిగా ఉదయనుడి వైపుకి నడిచి వస్తూ, ''మీ రెవరో అసాధ్యుల లాగా వున్నారే! ఇంతకాలానికి నా రహస్యం కనిపెట్టగలిగిన సమర్థులను చూడగలగటం నిజంగా నా అదృష్టమే అని భావిస్తున్నాను. ఐతే, దీనివల్ల మీకు కలగబోయే లాభం ఏమీలేదు. మీరు యిక్కడికి వచ్చిన పని ఏమిటో చెప్పితే నేను క్షణంలో నెరవేరుస్తాను. నే నుండగా మీరు శ్రమపడట మెందుకు?'' అని అంటూ, ఉదయనుడి మెడలో వున్న దండ కోసం అనేక విధాల ప్రాధేయపడి అడిగాడు.

అంత తేలికగా టోపీ పడేవాడా ఉదయనుడు! ''ముందు నా సోదరులను ఎక్కడ దాచావో చెప్పు, తరువాత సంగతి ఆలోచిద్దాం,'' అన్నాడు.

''ఎక్కడా దాచ లేదు. ఇక్కడే వున్నారు. అదుగో, నీ చొక్కా ఎడమ జేబులో వున్న డబ్బీలోని నల్లని భస్మం అక్కడ చల్లు,'' అంటూ గడ్డంవాడు, వాళ్ళని మాయంచేసిన చోటు చూపించాడు. అలాగే ఉదయనుడు నల్ల భస్మం చల్లే సరికి, ఒక్కసారిగా నిశీధుడూ, సంధ్యా ప్రత్యక్షమయారు.

తర్వాత ఉదయనుడు, "సరే, నా సోదరులు కనిపించారు. నా చెయ్యి తిరిగి వచ్చేమార్గం కూడా చెప్పు," అన్నాడు గడ్డంవాడితో.

"దీనికి మందు నీదగ్గిరేవుంది. చూడు, నీ కుడిజేబులో పచ్చని అంజనపు డబ్బీ వుంది. అది తీసి మొండిచేతికి రాయి," అన్నాడు గడ్డపువాడు.

ఉదయనుడు అలాగే చేసేసరికి, తిరిగి మామూలు చెయ్యి వచ్చేసింది.

ఇప్పుడు ఉదయనుడికి తన జేబులో వున్న తెల్ల భస్మమూ, ఎర్ర అంజనమూ ఎందుకు ఉపయోగపడతయ్యో తెలుసుకోవాలని తొందరకలిగింది. గడ్డపువాడికి అవి చూపుతూ, "ఇవి దేనికి?" అని అడిగాడు.

గడ్డపువాడు నవ్వుతూ, "ఈ మాత్రం గ్రహించలేవూ? నీ సోదరులను మాయం చేసింది, ఈ తెల్లని భస్మంతోనే. నీ చెయ్యి మాయం చేసింది, ఆ ఎర్రని అంజనంతో," అంటూ మర్మాలన్నీ దాచకుండా బయట పెట్టాడు.

"మరైతే యీ తువ్వాలు దేనికి?" అని ప్రశ్నించాడు ఉదయనుడు.

"దానివల్ల రెండు ఉపయోగాలు వున్నై. మీరు కోరుకున్న ఆహారం ఏదైనా సరే మనసులో తలుచుకుని తువ్వాలు




పరిచారంటే, వెంటనే అది తయారవుతుంది. ఏ విధమైన వ్యాధి నయినా యిది నయం చేస్తుంది కూడా," అని చెప్పాడు గడ్డపువాడు.

"అయితే, మా కంటి చూపులలో భేదాలు మారిపోయేట్టు చేయుగలదా, యీ తువ్వాలు?" అని మళ్ళీ అడిగాడు ఉదయనుడు.

"చూపు లేమిటి, భేదా లేమిటి?" అని గడ్డపువాడు ఆశ్చర్యంతో అడిగేసరికి, ఉదయనుడు తను చీకటిలో చూడలేక పోవటం, అలాగే తన సోదరులు వాళ్లకు అనుకూలం కానివేళలలో చూడలేక పోవటం వివరంగా చెప్పాడు.



అంతా విన్న తరువాత గడ్డపువాడు, "ఓహో, యిదా సంగతి ? మీ ముగ్గురికీ మామూలు చూపు వచ్చేమార్గం చెబుతా గాని, ముందు నా దండ నాకు యివ్వ మరి," అన్నాడు.

కాని, ఉదయనుడికి తెలుసు, ఏ మాత్రం ఏమరివున్నా గడ్డపువాడు తమని ప్రాణాలతో వదలడని. అందు వల్ల యుక్తిగా యిలా చెప్పాడు: "తాతా! మాకు చూపు వచ్చేమార్గం చెప్పు. ఇది ఒక్కటే మాకు మిగిలివున్న కోరిక. ఇక్కడికి పడమటి దిక్కుగా పదిమైళ్ళ దూరంలో ఒక గుహ వుంది. నీ దండ ఆ గుహలో వుంచి, మా దారిన మేము వెళ్ళిపోతాము. నీవు అక్కడికి వచ్చి దానిని తీసుకుపోవచ్చు."

ఆ దండ తనకు ఆయువుపట్టయి వుంది కనుక, గడ్డపువాడు యీ ఏర్పాటుకు ఒప్పుకొనక తప్పిందికాదు.

ఇంతలో నిశీథుడూ, సంధ్యా లేచి వచ్చి, "అన్నయ్యా! వీడి జీవానికి పడి మనం యింతవరకూ కడుపులు కాల్చుకునే వున్నాం. భలే ఆకలివేస్తోంది. ఏదీ ఆ తువ్వాలు మహత్తు ఎంతవరకు నిజమో చూద్దాం!" అన్నారు.

నిజానికి యీ మాట ఉదయనుడికి తోచనేలేదు. ఎప్పుడైతే సోదరులు యీ మాట అన్నారో, ఉదయనుడు రకరకాల ఫలాలపేర్లూ తలుచుకుని, తువ్వాలు పరిచాడు. మరుక్షణాన తువ్వాలు నిండా నవనవలాడుతూ రకరకాల పళ్ళూ నిండి కనుపండువు చేసినై. ఉదయనుడు కొన్ని తీసుకున్నాడు. కాని ఎన్ని తీసినా తువ్వాలు మీది పళ్ళు తరగనే లేదు. అందుచేత, దుష్టుడైనప్పటికీ గడ్డపువాడికి కూడా కొన్ని పళ్ళు పెట్టాడు.

కడుపు నిండాక ఉదయనుడు తువ్వాలు మడిచి జేబులో వుంచుకుని, "మరి ఇక మా చూపులు సరిఅయ్యే మార్గం చెప్పు. చూపులు వస్తే మా దారిన మేము పోతాం," అన్నాడు.

అందుకు గడ్డపువాడు, "నీ దగ్గిర వున్న ఎర్ర అంజనం ఉండ చెయ్యి. ఆ ఉండని యీ నారపీచులో చుట్టి ముట్టించు. దాని లోంచి బ్రహ్మండమైన పొగ వస్తుంది. మీరు ముగ్గురూ ఈ తువ్వాలు తలపైన కప్పుకొని, ఆ పొగ మీ కళ్ళకి తగిలేట్టు చూడాలి. ఒక్క అయిదు నిమిషాలు అలా ఉన్నట్లైతే, మీకు మామూలు చూపు వచ్చేస్తుంది," అని చెప్పాడు.



అలాగే ఉదయనుడు ఎర్ర అంజనం ఉండచేసి, ఆ ఉండను నారపీచులో కట్టాడు. కాని నిప్పు ఎక్కడి నుంచి తేవటం?

ఉదయనుడు ఏమి చెయ్యటమా అని ఆలోచిస్తుండగా, గడ్డపువాడు రెండు చెకుముకిరాళ్ళు తెచ్చి, నిప్పుచేసి అంటించాడు. నారపీచులో వున్న ఆ ఉండ అంటుకోగానే బ్రహ్మండమైన పొగ లేచింది. ఉదయనుడు తన సోదరులను కూడా తీసుకుని, ముగ్గురూ ఆ పొగలో కూచుని, తలలపైన తువ్వాలు కప్పుకున్నారు.

అయిదు నిమిషాల తరవాత ముగ్గురూ పొగలో నుంచి బయటికి వచ్చారు. ఒక్కొక్కళ్ళ కళ్ళ వెంబడి నీరు కాలువలా ప్రవహించి, కొంతసేపటికల్లా కంట తడి ఆరిపోయింది.

కాని, ఆశ్చర్యమేమిటంటే, తమకు మామూలు చూపు వస్తుందని యింతా చేస్తే, గడ్డపువాడు చెప్పినట్టు చెయ్యటం వల్ల చూపు రాకపోవటమే గాక, ఇప్పుడు కనుగ్రుడ్లే మాయమైపోయినై.

ఉదయనుడు ఉగ్రుడైనాడు: "ఏమిరా, దుర్మార్గుడా! ఇదేనా నీవు మాకు చూపులు తెప్పించటం?" అంటూ ఉరమసాగాడు.

అందుకు గడ్డపువాడు, "తొందర పడకు, బాబూ! మిమ్మల్ని మోసమే చెయ్యాలనుకుంటే, ఈ రహస్యాలన్నీ చెప్పేవాడినా? అసలు పని ముగియందే, అలా కేకలు వేస్తావెందుకు? ఇప్పుడు కనుగ్రుడ్లు కూడా లేవు కదా? నీ దగ్గిర



ఆ తర్వాత వాళ్ళు తమ గుర్రాల్ని తెచ్చుకుందామని చెప్పి బయలుదేరారు. మొదట ముగ్గురూ అడవిలోకి వచ్చి, అంతకు ముందు గుర్రాల్ని కట్టేసిన చెట్టు దగ్గిరికి చేరుకున్నారు. ఉదయనుడు తన దగ్గిర వున్న నల్ల భస్మం అక్కడ చల్లేసరికి, యథాప్రకారం గుర్రాలు రెండూ ప్రత్యక్షమైనై. వాటిని తీసుకుని వాళ్ళు గుహలో దాచిన నల్ల గుర్రం కోసం వెళ్ళి, దాన్ని కూడా తీసుకుని గడ్డంవాడి ఇంటికి తిరిగి వచ్చారు.

అప్పుడు గడ్డంవాడు, "మీ కోరికలన్నీ నెరవేరినట్టే కదా? ఇక మీ దారిన మీరు వెళ్ళండి. వాగ్దానం ప్రకారం నా దండ మాత్రం ఆ గుహలో వదిలి వెళ్ళండి. మాట తప్పితే మాత్రం...." అని యింకా ఏమో చెప్పబోతుండగా, నిశీధుడు అడ్డు తగిలి, "సరేకాని, అసలింతకూ నీ వెవరవు? దారినపోయే అమాయకులను, ఎందుకిలా నిర్బంధిస్తున్నావు?" అని అడిగాడు.

అందుకు గడ్డపువాడు, "ఆ సంగతి నేను చెప్పకూడదు. అది గొప్ప రహస్యం. అది వెల్లడించినట్టయితే, నేను తల పగిలి చస్తాను. కనుక క్షమించండి," అన్నాడు.

సోదరులు ముగ్గురూ ఒక్క మాటగా, వానిపైన సానుభూతి కనబరిచి,

వున్న ఆ పచ్చ అంజనం రెప్పల పైన రాచుకొని చూడు," అన్నాడు.

అలాగే ఉదయనుడు ఆ అంజనం కంటి రెప్పల పైన రాచుకునేసరికి మామూలుగా కళ్ళు వచ్చేసినై. వెంటనే సోదరుల కళ్ళకి కూడా రాచాడు. వాళ్లకీ వచ్చేసినై. తాను గడ్డంవాడి పైన అనవసరంగా కోపపడ్డందుకు ఉదయనుడు సిగ్గు పడ్డాడు. రాత్రివేళల తప్ప చూపు కనిపించని నిశీధుడూ, సంధ్యవేళ తప్ప చూపు కనిపించని సంధ్యా కూడా, ఇప్పుడు చక్కగా చూడగలుగుతున్నారు. ఇందుకు వాళ్ళు ఎంతో ఉప్పొంగిపోయారు.

ఈ రహస్యం గురించి అడగకుండా వది లేశారు. తర్వాత వాళ్ళు తమ తమ గుర్రాల మీద బయలుదేరి పోసాగారు. పోతూ పోతూ ఉదయనుడు, గడ్డపు వాడితో, ''మరొక్క కోరిక వున్నది. నీ దండ అయితే నీకు యిస్తాము కాని, ఈ అంజనాలూ, భస్మాలూ, తువ్వాలూ మాకు యివ్వాలి సుమా,'' అన్నాడు.

ఇందుకు కూడా గడ్డపువాడు ఒప్పు కోక తప్పింది కాదు. తర్వాత తెల్ల గుర్రం మీద ఉదయనుడూ, నల్ల గుర్రం మీద నిశిథుడూ, ఎర్ర గుర్రం మీద సంధ్యా బయలుదేరారు.

వాళ్ళు అలా పోయి పోయి చివరకు గడ్డపువాడికి గుర్తు చెప్పిన గుహ చేరుకున్నారు. మాట యిచ్చిన ప్రకారం ఉదయనుడు తన మెడలో దండ తీసి, ఆ గుహలో పెట్టాడు. ఎప్పుడైతే దండ మెళ్ళోనించి తీసివేశాడో, అప్పుడు ఉదయనుడికి మామూలు రూపం వచ్చేసింది. ఆ తర్వాత వాళ్ళు తిరిగి తమ గుర్రాల మీద సాగిపోయారు.

కొంతదూరం పోగా వాళ్ళు ఒక కీకారణ్యంలో ప్రవేశించారు. అప్పటికే చీకటి పడుతూవుంది. రాత్రి పూట ఆ అరణ్యంలో ఎక్కడ తల దాచుకోవటం? ఏమి చెయ్యటమా అని వాళ్ళు ఆలోచిస్తూండగా, మూడు సింహాలు తమ వైపు గర్జించుకుంటూ రాసాగినై. నిశిథుడికీ, సంధ్యకూ ఏమీ తోచిందికాదు గాని, యుక్తిపరుడైన



ఉదయనుడు తన దగ్గిర వున్న తెల్ల భస్మం తీసి, నిశీథుడి మీదా, సంధ్య మీదా, వాళ్ళ గుర్రాల మీదా చల్లాడు. వెంటనే వాళ్ళు మాయమయారు. తన గుర్రం పైనా, తన పైనా కూడా చల్లుకున్నాడు. తనూ మాయమయాడు!

వాళ్ళు మాయం కావటమూ, ఆ మూడు సింహాలూ ఉరుకులెత్తుతూ అక్కడికి చేరటమూ ఒక్కమాటే జరిగింది. విందు భోజనం దొరికింది కదా అని ఎంతో ఆశతో వచ్చిన ఆ సింహాలకి పాపం నిరాశ అయిపోయింది. కొంతసేపు అక్కడే తచ్చాడి, వాటి దారిన అవిపోయినై.

కాని, సింహాలు వెళ్ళిపోయినా మామూలు రూపంతో రాత్రివేళ, ఆ మహారణ్యంలో సంచరించటం ప్రమాదకరమని తలచి, తెల్లవారే వరకూ అదృశ్య రూపంతోనే వుండిపోయారు అన్నాదమ్ములు.

తెల్లవారింది. ఉదయనుడు తన వద్ద వున్న నల్లభస్మం, తన పైనా, తన గుర్రం పైనా, సోదరులపైనా, వాళ్ళ గుర్రాల పైనా చల్లేసరికి, మళ్ళీ మామూలు రూపాలు వచ్చేసినై.

ఇప్పుడు వాళ్ళు ముగ్గురూ గుర్రాల పైన వాయువేగాన స్వారి చేయగల్గుతున్నారు. గడ్డంవాడి దయవల్ల అందరికీ సరియైన చూపు వచ్చింది కనక, ఎవరు ముందూ, ఎవరు వెనకా అన్న బాధ లేదు. కొంత దూరాన వారికి ఒక నిర్మానుష్యమైన ప్రదేశంలో, ఒక భవనం కనిపించింది.

"ఆ భవనం ఎవరు ముందు చేరుకోగలమో చూద్దాం!" అంటూ సోదరులు ముగ్గురూ తమ తమ గుర్రాల్ని జోరుగా అదలించారు.

ఉదయనుడి గుర్రం శరవేగంతో పోతున్నది. అతనికి కొంచెం వెనుకలో సంధ్య, నిశీథుడు సమానవేగంతో వస్తున్నారు. కాని, చిత్రం! ముందు పోతున్న ఉదయనుడు రెప్పపాటులో మాయమయ్యాడు. —(ఇంకా వుంది)





# విధివంచితుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువు ఎన్ని ప్రయత్నాలు చేసినా విధి నిర్ణయించిన విధంగానే చివరకు జరుగుతుంది. అందుకు నిదర్శనంగా నీకు దృఢోద్యముడి వింతకథ చెబుతాను విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

సింధునదీ తీరాన బ్రహ్మస్థలీ అనే గ్రామంలో వేదశర్మ అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయనకు నాలుగు వేదాలూ తెలుసును. ఈయన వద్ద ఒక శిష్యుడు ఉండేవాడు. అతను వేదాధ్యయనంలో అంతులేని పరిశ్రమ చేసి దృఢోద్యముడు అనే పేరు సంపాదించుకున్నాడు. దృఢోద్యముడి తిండికీ, బట్టకూ అయే ఖర్చులు

## బేతాళ కథలు



భరించినవాడు తమోభేదకుడు అనే గృహస్థు. దృఢోద్యముడు భిన్నతమసుడు అనే ఆయన ఇంట ఉంటూండేవాడు. ఈ విధంగా దృఢోద్యముడు అమిత దీక్షతో అధ్యయనం చేసి, పదిఏళ్ళలో నాలుగు వేదాలూ అభ్యసించాడు.

ఒకరోజు రాత్రి భిన్నతమసుడు దృఢోద్యముడితో మాట్లాడుతూ, "నాకు ఈ విశాలమైన ఇల్లేకాక, విస్తారమైన ఆవుల మందలూ, గేదెలమందలూ, పొలాలూ, బానిసలూ, స్త్రీజనమూ, రక్షకులూ కూడా ఉన్నారు. నేను ఎంతో పాండిత్యం సంపాదించిఉండి కూడా, జన్మతః కర్షకుణ్ణి కావటం చేత నా జ్ఞానాన్ని ఉపయోగపరచలేక పోయాను. ఇప్పుడు వృద్ధాప్యం వచ్చేసింది. మహర్షులు చెప్పినట్టు నా మిగతా జీవితాన్ని తీర్థయాత్రలలో గడపనిశ్చయించాను. ముక్తి కోరినవాడు వారాణసి వద్ద అవిముక్తం సేవించాలి. నాకున్నదంతా నీ కిచ్చేస్తాను. తీసుకో," అన్నాడు.

దృఢోద్యముడు అందుకు ఒప్పుకుని, మర్నాడు తన గురువు వద్దా, తమోభేదకుడి వద్దా సెలవు పుచ్చుకుని వచ్చి, ఆస్తిని దానంగా పుచ్చుకుంటానన్నాడు.

అయితే మర్నాడు భిన్నతమసుడు ఎంతసేపు ఎదురుచూసినా దృఢోద్యముడు రాలేదు. మధ్యాన్నం కూడా అయేసరికి, భిన్నతమసుడు అతన్ని వెతుక్కుంటూ వెళ్లి, అతను తమోభేదకుడి ఇంటి ముందు తారట్లాడుతూ ఉండటం చూశాడు.

"నేనింకా తమోభేదకుడి వద్ద సెలవు పుచ్చుకో లేదు. ఇంట్లో అందరూ ఆదావుడిగా ఉన్నారు కారణం తెలీదు," అన్నాడు దృఢోద్యముడు భిన్నతమసుడితో.

భిన్నతమసుడు నవ్వి 'తమోభేదకుడి భార్య ప్రసవించ బోతున్నది. అందుకే ఆదావుడి. ఆమెకు ఆడపిల్ల పుట్టుతుంది. నువు ఆమెను పెళ్లాడతావు. ఆమె కులం చెడుతుంది," అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఇది విని దృఢోద్యముడికి కంగారు పుట్టింది. తమోభేదకుడికి నిజంగా ఆడ

పిల్లే పుట్టితే, భిన్నతమసుడు చెప్పిన మిగిలిన రెండు విషయాలుకూడా నిజ మవుతాయని అతనికి తోచింది. అతను ఇలా అను కుంటూండగానే తమోభేద కుడు, "ఛీ! ప్రారబ్ధం!" అనుకుంటూ బయటికి వచ్చాడు. ఆయనకు ఆడపిల్లే పుట్టింది. భిన్నతమసుడు చెప్పిన విష యాలు అబద్ధం చేసి, తాను ఆ పాపిష్ఠి పిల్లను పెళ్ళాడ కుండా ఉండగలందు లకు, దృఢోద్యముడు మర్నాడే బయలు దేరి, సింధూతీరాన్ని వదిలేసి, పదేళ్ళ పాటు నానాదేశాలు సంచారం చేసి చివరకు గంగాతీరానికి వచ్చాడు.



ఒకనాడు అతను ఒక బ్రాహ్మణగ్రామం చేరి, ఒక ఇంటికి వెళ్ళి, అక్కడ కని పించిన వృద్ధురాలితో, "అమ్మా, కాసిని మంచి నీరు ఇప్పించండి," అన్నాడు.

ఆ వృద్ధురాలు, "అమ్మా, తమాలికా! ఒక పీటా, చెంబుతో నీళ్ళూ తీసుకురా, తల్లీ!" అని కేక పెట్టింది.

లోపలి నుంచి ఒక పిల్ల వచ్చింది. ఆమె నల్ల దుస్తులు ధరించి, మెల్లకళ్ళతో ఒకేసారి అన్నిదిక్కులా చూస్తూ, కుంటిగా నడుస్తూ, ఒక చేతిలో పీటా, ఇంకో చేతిలో నీళ్ళ చెంబూ పట్టుకుని వచ్చింది.

"కూర్చో," అంటూ ఆమె పీట వెయ్య బోయి, చెంబును కిందవేసింది.

"అదేం పనే, అమ్మా? మళ్ళీ చెంబుతో నీరు పట్టుకురా," అన్నది వృద్ధురాలు.

దృఢోద్యముడు విశ్రాంతిగా కూర్చున్న మీదట ఆమె అతన్ని, "ఏ దేశం నుంచి వస్తున్నావు? ఎక్కడికి పోతున్నావు?" అని అడిగింది.

"అన్ని దేశాల నుంచీ వస్తున్నానని చెప్పొచ్చు. ఏ బ్రాహ్మణ గ్రామంలో నన్నా స్థిరపడి, పిల్లలకు చదువు చెబుతూ జీవితం వెళ్ళబుచ్చుదామనుకుం టున్నాను," అన్నాడు దృఢోద్యముడు.

"అయితే నువు మరెక్కడికీ పోనవ సరంలేదు. చదువులో పెట్టవలసిన వాళ్ళు నా మనమలు ఇద్దరున్నారు. వాళ్ళకు



నువు కావాలి. నీకు వాళ్ళుకావాలి.'' అన్నది వృద్ధురాలు.

దృఢోద్యముడు సరేనని, ఆ గ్రామం లోనే ఉండిపోయి, రెండేళ్ళ పాటు ఆవిడ మనమలిద్దరికీ చదువు చెప్పాడు. ఇంతలో ముసలావిడకు ఒక ఆలోచన వచ్చింది. తమాలికకు పెళ్ళియీడు వచ్చింది; ఆమెను దృఢోద్యముడికే ఇచ్చి చేస్తే సరిపోతుంది.

దృఢోద్యముడు కొంచెం ఆలోచించి ఈ పెళ్ళికి ఒప్పుకున్నాడు. ఎక్కడో పడమటి సముద్రతీరాన ఉన్న తమోభేద కుడి పాపిష్ఠి కూతురుతో పెళ్ళి తప్పించు కోవటానికి ఇదే మంచి మార్గంగా కన బడింది. అందుచేత అతను తమాలికను పెళ్ళాడేశాడు.

ఒక సంవత్సరం గడిచింది. ఒక రోజు తెల్లవారు ఝామున తమాలిక లేవటం చూసి దృఢోద్యముడు తమాలికను, ''మీ ఇంటి పెద్ద ఎవరు? ఆ ముసలావిడ నీకు ఏమవుతుంది? నాదగ్గిర చదువు కునే కుర్రవాళ్ళెవరు?'' అని అడిగాడు.

తమాలిక గట్టిగా నిట్టూర్చి, తన చరిత్ర ఇలా చెప్పింది:

'' ఈ ముసలావిడ భర్త సంపన్నుడు, దానశీలుడు. వాళ్ళకు ఒక కూతు రుండేది. ఆమెను తండ్రి తన శిష్యుడికే ఇచ్చిచేశాడు. పెళ్ళికాక పూర్వం ఎంతో వినయంగా ఉండిన ఆ శిష్యుడు, అల్లు డయాక అత్తమామల పట్ల కర్కోట కుడుగా తయారయాడు. తరవాత అతను తన బావమరిదితో తగాదా పెట్టుకుని సింధుప్రాంతానికి వెళ్ళిపోయాడు. అక్కడ అతను బ్రహ్మస్థలి అనే గ్రామంలో నివాసం ఏర్పాటుచేసుకుని, వైదికకర్మలు జరిపిస్తూ వచ్చాడు.

''కొంత కాలానికి అతనికి ఒక పాపిష్ఠి కూతురూ, యములవాళ్ళలాటి ఇద్దరు కవల కొడుకులూ పుట్టారు. నేనే ఆ కూతురును. నీ శిష్యులైన తొత్రిమూర్తి పిల్లలు నా తమ్ముళ్ళు. మాకు మా అమ్మా,

నాన్న బాగా తెలీదు. నదికి వరదలు వచ్చి సింధుదేశం జలమయమైనప్పుడు, చిన్న పిల్లలుగా ఉన్న మమ్మల్ని మా అమ్మమ్మ దగ్గిరికి పంపేశారు.''

దృఢోద్యముడి గుండెలో బాణం తగిలి నట్టయింది. భిన్నతమసుడి రెండో జోస్యం కూడా నిజమయింది. కనీసం మూడోదైనా అబద్ధం చేద్దామని, దృఢోద్యముడు కాశీకి బయలుదేరాడు. పుణ్యతీర్థాలు సేవించి, జీవితమంతా పుణ్యం సంపాదించటానికి అతను నిశ్చయించుకున్నాడు.

పన్నెండేళ్ళ అనంతరం అతను కాశీ చేర వస్తూండగా ఒక మహాపాశుపతుడు పుర్రెలమాల ధరించి, తాగి తూలుతూ రావటం అతనికి కనిపించింది. అతని వెనకగా ఒక కాపాలిని, తాను కూడా తప్ప తాగి, పాము లాగా మెలికలు తిరిగి నడుస్తున్నది. చింతనిప్పుల్లాగా ఉన్న ఆమె కళ్ళు మెల్ల కళ్ళు.

''కాపాలినీ, త్వరగా రా. అవి ముక్తంలో ధూపకాలం మించిపోగూడదు. మహాశివుణ్ణి 'హం! హం!' అని అర్చించి, మద్యం తాగాలి,'' అని పాశుపతుడు కాపాలినిని తొందర చేస్తున్నాడు.

ఇంతలో ఆ స్త్రీ దృఢోద్యముణ్ణి చూసి, తన భర్తగా గుర్తించి, కెవ్వున అరిచి, అతని కాళ్ళమీద పడిపోయింది.



చుట్టూ జనం మూగారు. తమాలిక తన భర్తతో, ''నీ వేదాధ్యయనం ఏమయింది? నిత్యాగ్నిహోత్రం ఏమయింది? పితృ తర్పణాలు ఏమయాయి? నన్ను విడిచి పెట్టేసి నేను చెడిపోవటానికి కారకుడి వయ్యావు!'' అని నిందించింది.

చుట్టూ చేరిన వారిలో బ్రాహ్మణులు దృఢోద్యముణ్ణి ప్రశ్నించి, తమాలిక ఆరోపణలు నిజమని గ్రహించి, ''నువు పాశుపతుడి వెంట ఉంటావా? భర్త దగ్గిరికి వస్తావా?'' అని అడిగారు. ఆమె భర్త దగ్గిరికే పోతానన్నది.

అప్పుడు బ్రాహ్మణులు దృఢోద్యముడితో, ''ఈమె పతనం కావటానికి

కారకుడివి నువే. ప్రాయశ్చిత్తాలు మేం చెబుతాం. నువు ఈమెను భార్యగా స్వీక రించవలసిందే," అన్నారు.

దృఢోద్యముడు అలాగేచేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, దృఢో ద్యముడికి కలిగిన అనుభవాలకు కారకు లెవరు ? విధినిర్ణయమా ? దృఢోద్యముడి ప్రవర్తనా? అతను భిన్నతమసుడి జోస్యం నమ్మినట్టా? నమ్మనట్టా? ఈ సందేహా లకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దృఢోద్య ముడు భిన్నతమసుడి జోస్యం నమ్మబట్టే అతను దానినుంచి తప్పించుకోవటానికి నానాయాతనలూ పడ్డాడు. నమ్మకం లేని వాడైతే ఆ జోస్యాన్ని నిర్లక్ష్యం చేసి తన మానాన తాను జీవించి ఉండేవాడే. భిన్నతమసుడి జోస్యం విధినిర్ణయాన్ని చెప్పినదే గనక, విధినిర్ణయం అమలు జరిగిందనాలి. అయితే, విధినిర్ణయం పూర్తిగా దృఢోద్యముడి నిర్ణయాల ద్వారానే అమలు జరిగింది. తమాలికను తాను పెళ్ళి చేసుకోకుండా ఉండాలంటే అతను పారిపోవటానికి బదులు ఆమెకు సాధ్యమైనంత దగ్గిరలో ఉండాలి. ఆమెను పెళ్ళాడిన ఏడాదికి అతను ఆమె పుట్టు పూర్వోత్తరాలు కనుక్కోవటం కూడా అతని పొరపాటే. వాటిని అతను ముందుగానే తెలుసుకుని ఉండవచ్చు. తెలుసుకున్న తరవాత అతను పారిపోవటం తప్పని తమాలిక పదిమంది ఎదటా నిరూపిం చింది. భర్త విడిచిన స్త్రీ పతితురాలు కాకేం చేస్తుంది? చివరకు కూడా ఆమె అతనితోనే ఉండగోరిందంటే ఆమె పతితు రాలు కావటానికి కారణం ఆమె దుర్బుద్ధి కాదని స్పష్టం అవుతున్నది. అందుచేత దృఢోద్యముడిది పూర్తిగా స్వయంకృతా పరాధమే!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)







# దొంగసహాయం

కాశ్మీరుదేశంలో ఒక కులీనుడైన పండితుడు ఉండేవాడు. వారిది జమీందారీ వంశం. అయితే పండితుడి పూర్వీకులు విచ్చలవిడిగా డబ్బు ఖర్చు చేసి, అంతు లేని ఆస్తి నాశనం చేసేశారు. ఆ కారణం చేత పండితుడు చాలా సామాన్యస్థితికి దిగజారిపోయాడు. ఐతే ఈ సంగతి లోకానికి తెలియకుండా ఆయన గుంభనగా సంసారం వెళ్ళబుచ్చుతూ వస్తున్నాడు.

ఈ పండితుడికి చక్కదనాల కుమార్తె ఉన్నది. ఆమెను చేసుకుంటామని ఎందరో యువకులు ముందుకు వస్తున్నారు. కాని పండితుడు తన కుమార్తె పెళ్ళి చేసేస్థితిలో లేడు. ఈ సంగతి కూడా ఎవరికీ తెలియదు. పండితుడు నివసించే లోగిలి అడుగున మాళిగలలో నిధి నిక్షేపాలు మూలుగుతున్నాయనే అందరూ అనుకునేవారు.

ఈ భ్రమ మూలంగానే పండితుడికి సుందరుడు అనే వాడితో వైరం కూడా వచ్చింది. ఇద్దరూ మొదట స్నేహితులే. ఒకసారి సుందరుడు పండితుణ్ణి చాలా పెద్ద మొత్తం అప్పు అడిగాడు. తన పేద స్థితిని పండితుడు లౌక్యంగా బయట పెట్టుకున్నాడు. కాని సుందరుడు తనకు అవమానం జరిగిందనుకుని, పండితుడిపై కక్షపట్టాడు.

పండితుడిపై పగ తీర్చుకోవాలన్న ఉద్దేశంతో సుందరుడు ఒక గజదొంగను పట్టుకుని, పండితుడి సొత్తంతా కాజెయ్యమని వాణ్ణి అడిగాడు. గజదొంగ అందుకు సంతోషంగా ఒప్పుకున్నాడు.

ఒక రాత్రి పండితుడు పడుకుని నిద్రపోబోతుండగా ఆయన భార్య, "ఏమండీ, అమ్మాయికి ఎన్నో సంబంధాలు వస్తున్నాయి గదా, మనకు తగిన సంబంధం

చూసి త్వరలో పెళ్ళి చెయ్యక, ఎందుకు తాత్సారం చేస్తున్నారు?'' అని అడిగింది. తాము ఆర్థికంగా చితికిపోయిన సంగతి ఆమెకు కూడా తెలియదు.

''నువ్వన్నది నిజమే. కాని, అసలు సంగతి ఏమంటే, నా దగ్గిర డబ్బులేదు. కొంతకాలంగా నేను ప్రతిష్ఠకోసం పాకు లాడుతూ మనకున్న తాహతును మించి ఖర్చు చేస్తూ వస్తున్నాను. ఇప్పుడున్న పరిస్థితి ఏమంటే, మన సంసారం జరగ టానికి ఎక్కడినుంచి డబ్బు తేవాలో నాకే తెలియదు. పిల్ల పెళ్ళి ఏంపెట్టి చెయ్యను?'' అని పండితుడు తన భార్యతో అన్నాడు.

''అయ్యో, ఎంత పాపిష్ఠిగతి దాప రించింది మనకు! ఇంతకాలం బతికి మనం దారిద్ర్యం పాలపడ్డామా?'' అని పండితుడి భార్య శోకించింది. పండితు డికి కూడా దుఃఖం ఆగలేదు.

భార్యా భర్తల సంభాషణ అంతా గజ దొంగ విన్నాడు. పండితుడి ఇల్లు దోచే ఉద్దేశంతో వాడు ఆ రాత్రే దొంగతనంగా లోపల చొరపడ్డాడు. తనకు అబద్ధాలు చెప్పి సుందరుడు పంపాడని వాడికి చాలా కోపం వచ్చింది. పండితుడూ, ఆయన భార్యా నిద్రపోయినదాకా వాడు పొంచి ఉండి, తరవాత చల్లగా బయటికి జారుకున్నాడు.

మర్నాడు ఉదయం సుందరుడు గజ దొంగ కోసం చాలాసేపు చూశాడు. వాడు రాలేదు సరిగదా, సుందరుడి ఇంటిని ఎవరో కొల్లగొట్టినట్టు తెలిసింది. ఇంట్లో ఒక్క నగ మిగలకుండా ఎవరో అంతా ఊడ్చేశారు.

మర్నాడు నిద్ర లేస్తూనే పండితుడి భార్య తన తలదగ్గిర ఒక మూట ఉండటం చూసింది. విప్పి చూస్తే, ఆ మూట నిండా బంగారు నగలూ, వెండి నాణాలూ ఉన్నాయి. దానితో బాటు ఒక కాగితం ముక్కమీద, ''మీ కుమార్తె వివాహానికి గజదొంగ సమర్పించుకుం టున్న చిన్నకానుక'' అని రాసి ఉన్నది.



# లౌక్యం లేని జ్యోతిష్కుడు

అక్బర్ దగ్గర మంత్రిగా ఉన్న బీర్బల్ చాలా తెలివిగలవాడు.

ఒక రోజు అక్బర్‌కు తన పళ్ళు అన్నీ రాలిపోయినట్లు కల వచ్చింది. మరునాడు ఆస్థాన జ్యోతిష్కుణ్ణి పిలిపించాడు. అతనికి తన కలను గూర్చి చెప్పి, ఫలితం చెప్పమన్నాడు. జ్యోతిష్కుడు తన గ్రంథాలు తిరగవేసి, "తమ కళ్ళ ముందే, తమ బంధువులూ, తమ పరివారమూ చనిపోతారు," అని చెప్పాడు. చెడ్డవార్త చెప్పినందుకు గాను పాదుషా కోపగించి, అతణ్ణి చెరసాలలో వేయించాడు.

ఇంతలో ఏదో పని మీద వెళ్ళి ఉండిన బీర్బల్ అక్కడికి వచ్చి, సంగతి తెలుసుకొని, అమాయకుడైన ఆ జ్యోతిష్కుణ్ణి విడిపించాలనుకున్నాడు.

అక్బర్ దగ్గిరికి వచ్చి, "పాదుషా! మీ స్వప్నఫలితం నేను మనవి చేసుకుంటాను," అని వేళ్ళు లెక్కించి, ఆకాశం వేపూ, భూమి వేపూ కాసేపు చూచి, "పాదుషా! తమ బంధువులూ, తమ పరివారమూ కంటె తమరు ఎక్కువ ఆయుర్దాయం కలవారు," అని విన్నవించుకున్నాడు.

"ఇంత శుభఫలం చెప్పినందుకు ఏం కావాలో కోరుకో," అన్నాడు అక్బర్.

"ఆస్థాన జ్యోతిష్కుణ్ణి విడుదల చెయ్యండి, పాదుషా!" అని మనవి చేసుకున్నాడు బీర్బల్.

విడుదలై వచ్చిన జ్యోతిష్కుణ్ణి ప్రక్కకు పిలిచి, "జ్యోతిష్యం చెప్పాలంటే, ఒక్క శాస్త్రజ్ఞానమే చాలదు, కొంత లౌక్యం కూడా కావాలి. లౌక్యం లేని జ్యోతిషం వృథా!" అని మందలించి పంపాడు బీర్బల్.

—బి. శ్రీనివాసులురెడ్డి





ఒక గ్రామంలో రామశర్మా, బంగారయ్యా అనే ఇద్దరు స్నేహితులు ఉండేవారు. ఇద్దరూ పేదవారే. ఒక రోజు ఇద్దరూ కలిసి ఆలోచించుకుని, ధనం సంపాదించ డానికి, తమ గ్రామం నుంచి బయలు దేరారు. చాలా దూరం ప్రయాణం చేసి అలసిపోయి వారు ఒక మునిఆశ్రమం ముందు చతికిల బడ్డారు. ముని వారి సంగతి అంతా అడిగి తెలుసుకుని ఇలా అన్నాడు:

"నాయనలారా, నేను ఎంతో కష్టపడి ఎన్నో విద్యలు సాధించాను. మీలో ఒకడు బ్రాహ్మణుడు. బ్రాహ్మణుడికి ధనం మీద వ్యామోహం తగదు; జ్ఞానం సంపాదించి, దాన్ని పదిమందికీ పంచి యిచ్చి, పేరు ప్రఖ్యాతులు తెచ్చుకుంటే బ్రాహ్మణ జన్మ సార్థక మవుతుంది. రెండవవాడు వైశ్యుడు. కాబట్టి, అతను వ్యాపార రహస్యాలన్నీ నావద్ద నేర్చుకుని ధన సంపాదన చేయవచ్చు. వ్యాపారం ధనం సంపాదించటానికి మాత్రమేగాక ప్రజా సేవకు కూడా ఉపయోగపడుతుందని గ్రహించినవాడే అసలైన వైశ్యుడు."

ముని సలహా ప్రకారం స్నేహితు లిద్దరూ మూడు సంవత్సరాల పాటు విద్యాభ్యాసం చేశారు. రామశర్మ అనేక శాస్త్రాలలో పాండిత్యం సంపాదించాడు. బంగారయ్య వ్యాపార రహస్యాలన్నీ తెలుసుకున్నాడు. ఈ జ్ఞానంతో రామశర్మ రాజుగారి వద్ద ఆస్థాన పండితుడు అయ్యాడు. బంగారయ్య వ్యాపారంలో అభివృద్ధి సాధించాడు. నాలుగైదు సంవత్సరాలు గడిచీ గడవక ముందే ఇద్దరూ సంపన్నులయారు.

కాలం గడిచింది. రామశర్మకు కృష్ణశర్మ అనే కొడుకు కలిగాడు. కాని

ఆ కొడుకు గురించి రామశర్మకు బెంగ పట్టుకున్నది. వాడు చాలా పెంకెవాడు. వాడికి చదువు మీద ఏ మాత్రమూ ఉత్సాహం లేదు. అస్తమానమూ ఆటలతోనూ, అల్లరితోనూ కాలక్షేపం చేసేవాడు. తన కొడుకు తనంతవాడు కావటానికి రామశర్మ చేసిన ప్రయత్నం కొంచెం కూడా ఫలించలేదు.

ఇంతలో ఒక వింత జరిగింది.

రామశర్మ ఒకనాడు విద్యార్థులకు కొన్ని శ్లోకాలు బోధిస్తున్నాడు. అవి చాలా కఠినమైన శ్లోకాలు కావటంచేత విద్యార్థులు వాటిని గ్రహించలేకుండా ఉన్నారు. చెప్పినదే చెప్పి నోరు నొప్పిపుట్టి, రామశర్మ కాస్సేపు విశ్రాంతి తీసుకుందామని లోపలికి వెళ్ళాడు.

తండ్రి శిష్యులకు పాఠం చెప్పటానికి పడుతున్న శ్రమ కృష్ణశర్మ గమనిస్తూనే ఉన్నాడు. తండ్రి లోపలికి వెళ్ళగానే అతను వచ్చి, తండ్రి కూర్చునే ఆసనం మీద కూర్చుని, తానే పాఠం చెప్పటం మొదలు పెట్టాడు. చిత్రమేమిటంటే, రామశర్మ నోట వింటే అర్థంకాని శ్లోకాలు కృష్ణశర్మ నోట వింటూంటే విద్యార్థులకు మరింత తేలికగా అర్థమయాయి.

లోపలినుంచి తిరిగి వస్తూ రామశర్మ ఆ దృశ్యం చూసి ఆశ్చర్యపోయాడు.



తన కొడుకు తెలివి తక్కువవాడు ం వాడి జ్ఞాపకశక్తి కూడా గొప్పది. చదువుకుంటే వాడికి అవలీలగా ఎంత చదువైనా వస్తుంది.

రామశర్మ ఈ మాటే అంటే, కృష్ణశర్మ, "ఎందుకు చదువుకోవాలి?" అని అడిగాడు.

"పదిమంది చేతా గౌరవం పొందాలన్నా, పూజించబడాలన్నా, ధనం సంపాదించాలన్నా విద్య చాలా అవసరం. ఇది నువ్వు ఎంత త్వరగా గ్రహిస్తే అంత మంచిది." అన్నాడు రామశర్మ.

"మహాపండితుడి కొడుకునని అందరూ నన్ను గౌరవిస్తారు. బ్రాహ్మణ్ణి గనక



పూజిస్తారు. ధనవంతుడి కొడుకును, ఇంక సంపాదించే దేమిటి?'' అని కృష్ణశర్మ అడిగాడు.

కొడుకు బుద్ధి రామశర్మకు అర్థమయింది. దాన్ని మార్చటానికి ఏం చెయ్యాలా అని ఆయన ఆలోచిస్తూ ఉండగా, ఆయన ఇంటికి బంగారయ్య వచ్చాడు. ఇద్దరూ కలుసుకుని మాట్లాడుకోవటంలో, బంగారయ్యకూడా తనకొడుకు గురించి ఇలాగే బాధపడుతున్నట్టు బయటపడింది. బంగారయ్య కొడుకు వరాలయ్య కూడా జులాయివాడుగా తయారై, తండ్రి తనను దారిలో పెట్టటానికి ప్రయత్నించినప్పుడల్లా, ''ధనవంతుడి కొడుకును! నాకు జాగ్రత్తగా ఉండవలసిన అవసరం ఏమిటి?'' అంటున్నాడు.

మిత్రులిద్దరూ కూర్చొని ఒక పథకం వేశారు. ఆ పథకం ప్రకారం బంగారయ్య, తన కొడుకును రామశర్మ ఇంట వదిలి, తాను భార్యతోసహా వ్యాపారం మీద నగరం విడిచి వెళ్ళిపోయాడు. వెళ్ళేటప్పుడు ఆయన తన కొడుక్కు సేవలు చెయ్యటానికి ఇద్దరు సేవకులను పెట్టి వెళ్ళాడు.

కృష్ణశర్మకూ, వరాలయ్యకూ మంచి స్నేహం అయింది. ఇద్దరూ ఒకేరకం మనుషులు. వరాలయ్య సేవకులు కృష్ణశర్మకు కూడా సేవలుచేస్తూ ఉండేవాళ్లు.

రెండు నెలలు గడిచాయి. రామశర్మ ఒకరోజు వరాలయ్యను పిలిచి, ''మీనాన్న డబ్బు కావాలని కబురుచేశాడు. మీ ఇల్లు అమ్మి డబ్బు పంపించు,'' అన్నాడు.

వరాలయ్య పట్టించుకోలేదు.

మరో నెల గడిచింది. ఒక రోజున రామశర్మ వద్దకు ఒక మనిషి వచ్చి, ''బంగారయ్యగారి ఓడ మునిగింది. దానితోపాటు బంగారయ్యా, భార్యా, వారి సంపాదన యావత్తూ మునిగిపోయాయి. నేను ఆయనను కొనప్రాణంతో ఒడ్డుకు తెచ్చి, మా యింటికి చేర్చాను. కాని ఆయన బతకలేదు,'' అని చెప్పాడు.

ఈమాట విని ఏడుస్తున్న వరాలయ్యను రామశర్మ ఓదార్చాడు. కాని ఆయన ఒక్క విషయం వరాలయ్యతో స్పష్టంగా చెప్పాడు: "నేను నీ తండ్రిలాగా వ్యాపారస్థుణ్ణి కాను. నిన్ను పోషించటం నాకు సాధ్యం కాదు. అందుచేత నీ దారి నువు చూసుకోవలిసిందే."

వరాలయ్యకు పౌరుషం వచ్చి, రామశర్మ ఇంటి నుంచి వెళ్ళిపోయాడు. కాని అతనికి తలదాచుకునే చోటు ఎక్కడా దొరకలేదు. తిండి కూడా ఎవరూ పెట్టకపోవటం చేత, వరాలయ్య అభిమానం చంపుకుని తిరిగి రామశర్మ ఇంటికే వచ్చి, భోజనం పెట్టమన్నాడు.

రామశర్మ అతనికి భోజనం పెట్టాడు, కాని ఇలా ఎంతో కాలం జరగదని చెప్పాడు.

ఈమాట విని కృష్ణశర్మకు కోపంవచ్చి, "స్నేహితుడి కొడుకును కష్టసమయంలో ఆ మాత్రం ఆదరించలేరా?" అని తండ్రిని అడిగాడు.

"బంగారయ్య నా స్నేహితుడు. అతను కష్టంలో ఉంటే తప్పక ఆదరించి ఉండే వాణ్ణి. వరాలయ్యకూ, నాకూ సంబంధం లేదు," అన్నాడు రామశర్మ.

"వరాలయ్య మీ కేమీ కాకపోవచ్చు. అతను నా మిత్రుడు. నా మిత్రుడికి ఈ



ఇంట్లో గౌరవం లభించదా?" అని కృష్ణశర్మ అడిగాడు.

"ఏమిటి నీ గొప్పతనం?" అన్నాడు రామశర్మ నిరసనగా.

"దేవుడికి అర్చనచేసి నందువల్ల పూజారిని దేవుడంత వాడుగా గౌరవిస్తాం గద. మహాపండితుడు రామశర్మ కుమారుణ్ణి, అది నాకు గొప్పతనం కాదా?" అని కృష్ణశర్మ అడిగాడు.

రామశర్మ ఒక్కనిమిషం ఆలోచించి, "నీ ప్రశ్నకు సమాధానం ఇస్తాను, కాని ముందుగా నువ్వొక పని చెయ్యాలి. నీకూ, వరాలయ్యకూ సేవలు చేసిన ఇద్దరు సేవకులనూ పిలిచి, వాళ్ళచేత వరాలయ్యకు

రెండు రోజులపాటు సేవలు చేయించు." అన్నాడు.

కృష్ణశర్మ ఎంతో ఉత్సాహంగా వెళ్ళాడు. వాళ్ళు ఇదివరలో ఒక్కపైసా అడగకుండా సమస్తసేవలూ చేసినవాళ్ళు, కాని ఇప్పుడు వరాలయ్యను గురించి నిర్లక్ష్యంగా మాట్లాడి, అటువంటి దరిద్రుడికి సేవలు చెయ్యమని చెప్పేశారు.

వాళ్ళ సమాధానానికి ఆశ్చర్యపోయి, కృష్ణశర్మ తిరిగి వచ్చి తన తండ్రికి జరిగినది చెప్పాడు.

రామశర్మ నవ్వి, "వాళ్ళు సరిగానే చెప్పారు. వరాలయ్యకు వ్యక్తిత్వం లేదు. అతను తండ్రి నీడలో ఉన్నంతకాలమూ, తండ్రి డబ్బు అతనికి రక్ష అయింది. ఆ డబ్బుపోగానే అతను సామాన్యుడయ్యాడు. రేపు నీగతీ అంతే అవుతుంది. నా పాండిత్యం ద్వారా నువు గౌరవం పొందుతున్నావు. నా ఆస్తి ఆ పాండిత్యమే. అది నీకు సంక్రమించక పోతే నీ పనీ అంతే గదా! స్వయం కృషివల్ల ఆర్జించినదే శాశ్వతం. వ్యాపారరహస్యాలు తెలియనివాడు వైశ్యుడు కాడు. విద్యలేనివాడు బ్రాహ్మణుడు కాడు," అన్నాడు.

"స్వయంకృషి అవసరమే. అందుకే మీరు మీ స్నేహితుడికి చేయగల సహాయం నేను నా స్నేహితుడికి చేయలేకుండా ఉన్నాను. ఇప్పుడు ఏం చెయ్యాలి?" అని కృష్ణశర్మ అడిగాడు.

"నువూ, నీస్నేహితుడూ నేను చెప్పిన చోటికి వెళ్ళి, కొన్ని ఏళ్ళపాటు విద్యాభ్యాసం చెయ్యండి," అని రామశర్మ తాము విద్యాభ్యాసం చేసిన ముని ఆశ్రమం గురించి చెప్పాడు.

కృష్ణశర్మా, వరాలయ్యా రెండు సంవత్సరాలపాటు ముని ఆశ్రమంలో విద్యాభ్యాసం చేసి తిరిగి వచ్చారు. వరాలయ్య తండ్రి జీవించి ఉండడమే గాక, తన ఆస్తిని వ్యాపారంలో రెట్టింపు చేశాడు. తమను మార్చటానికి రామశర్మా, బంగారయ్యా కలిసి పన్నిన పన్నాగమే ఇది అని వాళ్ళు తెలుసుకున్నారు.





# రాజు-చండాలుడు

పూర్వం ఉత్కళదేశాన్ని పురుషోత్తమదేవుడు అనే రాజు పాలించేవాడు. ఆయన గొప్ప జగన్నాథభక్తుడు. రాజ్యం జగన్నాథుడిదేననీ, తాను ఆ దేవుడి సేవకుడుగా రాజ్యపాలన చేస్తున్నాననీ ఆయన నమ్మేవాడు.

పూరిలో ఏటా ఆషాఢమాసంలో రథయాత్ర జరుగుతుంది. ఆ ఉత్సవానికి వేలాది జనం వస్తారు. రథయాత్రలో పాల్గొనే మూడు రథాల కింద రాజు స్వయంగా చీపిరికట్టతో ఊడ్చేవాడు. తరవాతనే రథాలను ప్రజలు లాగేవారు.

పురుషోత్తముడు ఒకసారి దక్షిణ దిగ్విజయానికి వెళ్ళి, కంచి రాజుకూతురైన పద్మావతిని చూశాడు. ఆమె అసాధారణ సౌందర్యవతి. ఆమెను చూడగానే పురుషోత్తముడు మోహించి, పెళ్ళాడ నిశ్చయించాడు. ఈ విషయం దూత ద్వారా విని, పద్మావతి తండ్రి వివాహానికి సమ్మతించాడు. పురుషోత్తముడి ఆహ్వానం మీద ఆయన ఉత్కళదేశానికి పోవటమే గాక, రథోత్సవాన్ని కూడా కళ్ళారా చూతామనుకున్నాడు.

రథోత్సవంనాడు, దేవాలయం నుంచి ఉద్యానభవనం దాకా ఉన్న వీధి అంతా జనంతో నిండిపోయింది. శంఖాలు మోగుతున్నాయి. జనం కోలాహలం చేస్తున్నారు. దేవాలయం నుంచి జగన్నాథ, బలభద్ర, సుభద్రల విగ్రహాలను తెచ్చి, మూడు రథాలలోనూ ఉంచారు.

అంతదాకా కంచి రాజుతో కబుర్లు చెబుతున్న పురుషోత్తముడు లేచి వెళ్ళి, రథాల కింద చీపిరికట్టతో ఊడ్చాడు. ప్రజలు హర్షధ్వానాలు చేశారు.

పురుషోత్తముడు చీపిరికట్ట తీసుకుని ఊడవటం చూసి, కంచి రాజుకు రోత

ళ్టింది. రథయాత్ర ముగియగానే ఆయన కంచికి తిరిగి వెళ్ళి, "నా కుమార్తెను చండాలుడికి ఇచ్చి పెళ్ళి చెయ్యను," అని ఉత్కళ రాజైన పురుషోత్తముడికి కబురుచేశాడు.

పురుషోత్తముడికి పట్టరాని కోపం వచ్చింది. ఆయన కంచిరాజ్యం మీద యుద్ధం ప్రకటించి, దండెత్తి వెళ్ళాడు. తరువాత జరిగిన యుద్ధంలో పురుషోత్తముడికి విజయం లభించింది. రాజకుమార్తె పద్మావతి అతనికి బందీగా చిక్కింది.

అయితే పురుషోత్తముడికి ఇప్పుడు ఆమెను పెళ్ళాడాలన్నకోరిక లేదు. ఆయన తన మంత్రిని పిలిచి, "ఈమె తండ్రి నన్ను చండాలుడు అన్నాడు. ఈమెను కసువు ఊడ్చే వాడికిచ్చి పెళ్ళి చెయ్యండి," అని ఆజ్ఞాపించాడు.

"చిత్తం మహారాజా! అలాగే చేస్తాను," అన్నాడు మంత్రి.

కాని జాలిగుండెగల ఆ మంత్రి అలా చెయ్యలేదు. ఆయన పద్మావతిని తన ఇంటికి చేర్చాడు. అక్కడ మంత్రి, ఆయన భార్య పద్మావతిని తమ సొంత కూతురులాగే చూసుకుంటూ, తమ ఇంట రహస్యంగా ఉంచారు.

కొద్ది నెలల అనంతరం తిరిగి రథోత్సవం వచ్చింది. రాజు తన ఆచారం ప్రకారం చీపిరికట్ట తీసుకుని, రథాల కింద ఊడుస్తున్నాడు.

ఆ సమయంలో మంత్రి పద్మావతిని తీసుకుపోయి, "మహారాజా, మీ ఆజ్ఞ నెరవేర్చటంలో జాప్యం జరిగినందుకు క్షమించండి. ఈ పిల్లకు ఊడ్చే భర్త మీ కన్న యోగ్యుడు దొరకడు. దయచేసి ఈమెను పెళ్ళాడండి," అన్నాడు.

అప్పటికి పురుషోత్తముడి ఆగ్రహం చల్లారిపోయింది. తన మంత్రి చేసిన యుక్తికి సంతోషించి, మహా వైభవంగా పద్మావతిని వివాహం చేసుకున్నాడు.

వారి సంతతి ఇప్పటికీ పూరీ రథోత్సవం నాడు చీపిరికట్ట తీసుకుని దేవాలయం ఊడుస్తారు.






ఒక వర్తకుడి కుమారుడు, రామపాలుడు అనేవాడు, అరణ్యంలో దారి తప్పి, వారం రోజులపాటు ఆ అరణ్యం నుంచి బయట పడలేక, తన ప్రాణాల మీద ఆశవదులుకున్నాడు. ఆ సమయంలో అతనికి ఒక వింత దృశ్యం కనబడింది. ఒక కొండచిలువ ఒక జింకపిల్ల వెనుక కాలు పట్టుకుని, దాన్ని మింగే ప్రయత్నంలో ఉన్నది.

ఆ బుల్లి జింక పిల్లను చూసి జాలిపడి రామపాలుడు, ఒక ఉపాయం చేసి, దాన్ని పాము బారినుండి విడిపించాడు. పాము శరీరం మీదికి ఒక చెట్టు వంగి ఉన్నది. రామపాలుడు తన కత్తితో ఆ చెట్టును కొట్టి, అది పాము శరీరం మీద పడేటట్టు చేశాడు. ఆ దెబ్బకు పాము శరీరం ఒకటి రెండు చోట్ల బాగా నలిగిపోయింది. ఆ బాధలో అది మెలికలు తిరుగుతూ నోరు తెరిచి, జింక పిల్లను వదిలేసింది.

జింక పిల్ల రామపాలుడి కేసి కృతజ్ఞతతో చూసి, నింపాదిగా ముందుకు సాగింది. అయితే, అది కొద్దిదూరం మాత్రమే వెళ్ళి, మళ్ళీ వెనక్కు వచ్చింది. జింక పిల్ల ఇలా మళ్ళీ మళ్ళీ చెయ్యటం చూసి, అది తోడులేకుండా వెళ్ళటానికి భయపడుతున్న దనుకుని, రామపాలుడు తాను కూడా దానివెంట బయలుదేరాడు.

జింక పిల్ల అతన్ని పళ్ళు సమృద్ధిగా ఉన్న చోటికి తీసుకుపోయింది. అక్కడే ఒక సెలయేరు పారుతున్నది. రామపాలుడు కడుపునిండా పళ్ళుతిని, నీరు తాగి, బాగా అలసిపోయి వుండటంచేత పడుకుని నిద్రపోయాడు.

అతను సేదదేరి నిద్రలేచేసరికి జింక పిల్ల పక్కన నిలబడి ఉన్నది. అతను

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



లేవటం చూసి అది మళ్ళీ నడవసాగింది. రామపాలుడు దాని వెంట బయలుదేరాడు. త్వరలోనే ఇద్దరూ అరణ్యం దాటి ఒక పొలిమేర చేరుకున్నారు. అక్కడికి సమీపంలోనే కోటగోడ ఉన్నది. లోపల దూరంగా ఎత్తయిన భవనాలున్నవి. జింక పిల్ల వెళ్ళిపోయింది.

అప్పటికే చీకటిపడింది. రాత్రి ఎక్కడ గడపాలా అని ఆలోచిస్తూ రామపాలుడు చుట్టూ కలయజూసి, తాను నిలబడి ఉన్నచోటు ఒక శ్మశానమని తెలుసుకున్నాడు. ఆ రాత్రి చెట్టు మీద గడప నిశ్చయించి, అతను ఒక చెట్టు ఎక్కి, దాని పంగలో చేరాడు. మరుక్షణమే అతనికి ఒక భీతావహమైన దృశ్యం కనిపించింది. అతని తల మీద వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి. ఎందుకంటే, కొత్తగా పూడ్చిన ఒక గుంట నుంచి ఒక మనిషి శరీరం పైకి రాసాగింది. కొమ్మల్లో వున్న రామపాలుడు కెవ్వున అరిచి, వణక నారంభించాడు.

"భయపడకు, భయపడకు. నేను దయ్యాన్ని కాను. నీలాటి రక్తమాంసాలు గల మనిషినే! నా దురదృష్ట కథ చెబుతాను." అన్నాడు భూమి నుంచి పైకి వచ్చిన మనిషి.

రామపాలుడు ధైర్యం తెచ్చుకుని, చెట్టు దిగి వచ్చి, "ఈ ఘోరానికి అర్థం ఏమిటి?" అని అడిగాడు.

"నా కథ వింటే నీ కంతా అర్థమవుతుంది." అంటూ ఆ మనిషి తన కథ ఇలా చెప్పాడు:

"నేను ఒక రాజకుమారుణ్ణి. యుక్త వయసురాగానే నేను మా దేశం విడిచి, నా గుర్రం మీద దేశసంచారం బయలుదేరాను; అనేక పట్టణాలూ, నగరాలూ, రాజ్యాలూ చూశాను. ఒక చిత్రమైన దేశం ఉన్నదనీ, దానిని పాలించే రాజకుమార్తె సాటిలేని అందగత్తె అనీ ఒక నాడు నాకు తెలిసింది. ఒక పందెంలో గెలిచిన వాణ్ణి తాను పెళ్ళాడి, దేశానికి

రాజును చేస్తానని ఆమె ఒక ప్రకటన చేసింది. నేను ఆమె చిత్తరువు చూశాను. ఆమె నిశ్చయంగా అద్భుత సౌందర్యవతి. నేను మనసు పట్టలేక, ఆ దేశాన్ని వెతుక్కుంటూ వచ్చాను.

"ఆమె నాకు హృదయ పూర్వకమైన స్వాగతం చెప్పింది. ఆమె అందం చూసి నాకు వెర్రెత్తిపోయింది.

"'పందెంలో పాల్గొనటానికి ఒక షరతు. నువు పందెంలో ఓడిపోతే, యావజ్జీవం నాకు సేవకుడుగా ఉండిపోవాలి. అందుకు సమ్మతమేనా?' అని ఆమె నన్ను అడిగింది.

"ఆమె సాధుత్వం చూసి ముగ్ధుడినై, అందుకు సమ్మతించాను. ఆమె 'నాకు ఒక ఖాళీపాత్ర చూపింది. ఆమె ఒక సంచీ నుంచి రెండు చిన్న పెట్టెలు తీసింది. అవి ఆమె అరచేతిలో ఇమిడేటంత చిన్నవి. ఆమె వాటిని ఖాళీపాత్ర పక్కన ఉంచి, కుడిచేతిలోకి ఒకటి తీసుకుని ఆడించింది. అలా ఆడించినప్పుడు ఆ పెట్టె ఏమీ చప్పుడు చెయ్యలేదు. దాన్నిబట్టి ఆ పెట్టెలో ఏమీ లేదని తెలిసింది. దాన్ని ఆమె పాత్రలో పెట్టి, ఎడమ చేత్తో రెండో పెట్టె తీసుకున్నది. ఆమె దాన్ని ఆడించినప్పుడు, అందులో ఏదో ఉన్నట్టుగా ధ్వని వినిపించింది. ఆమె దాన్ని కూడా పాత్రలో ఉంచి, నా కేసి తిరిగి, 'యువకుడా, ఈ పాత్రలో రెండు పెట్టెలున్నాయి. అందులో ఒక దానిలో





నాణెం ఒకటి ఉన్నది. నాణెం ఉన్న పెట్టెను తీయగలిగావంటే, నేనూ, నా రాజ్యమూ నీదే!' అన్నది.

"నేను ఈ పరీక్షలో అపజయం పొందాను. ఒక పెట్టె తీసి ఆడించాను, కాని అది మోగలేదు. ఆమె తన ఎడమ చేత్తో పాత్ర నుంచి రెండో పెట్టెను తీసి ఆడించేసరికి, ధ్వని వచ్చింది. నేను ఆమెకు బానిసనై పోయాను. నా లాగే పందెంలో ఓడిపోయి, ఆమెకు బానిసలై పోయిన అనేకమంది యువకులలో నేనూ ఒకణ్ణి.

"రోజులు గడుస్తున్నాయి. తప్పించుకు పోవటానికి మార్గం చూస్తున్నాను. సేవలు సమర్థంగా చేసి, నేను ఆమెకు కొంత అభిమాన పాత్రుణ్ణి అయాను. ఒకనాడు నాకు జబ్బుగా ఉన్నట్టు నటిస్తూ, రాణీని చూడగోరుతున్నట్టు వార్త పంపాను. ఆమె దయతో నన్ను చూడవచ్చి, 'యువకుడా, నీకు ఏమయింది?' అని అడిగింది.

"మహారాణీ, దయామయీ, వచ్చావా? కృతజ్ఞుణ్ణి. నేను చనిపోబోతున్నాను. ఒక్క కోరిక కోరుతాను. నేను రాజ వంశంలో పుట్టిన వాణ్ణి. మా వంశాచారం ప్రకారం నా శవాన్ని దయఉంచి పాతి పెట్టించు, దహనం చేయించవద్దు. నా ప్రాణాలు పోయాక నన్ను దాస్య విముక్తుణ్ణి చేసి నగరం వెలపల పాతి పెట్టించాలి," అని కోరాను.

"'అలాగే చేయిస్తాను. నీకు తృప్తి కలిగింది గద?' అన్న దామె. నేను ఆమెకు నా కృతజ్ఞత తెలుపుకున్నాను."

ఈ కథను ఆసక్తితో వింటున్న రామపాలుడు అడ్డం వచ్చి, "నీ పేరు ఏమిటో కూడా చెప్పావు కావు. నా పేరు రామపాలుడు. నీ పేరేమిటి?" అని అడిగాడు.

"నా పేరు సాగరకుమారుడు," అని అతను తన కథను ఇలా కొనసాగించాడు:

"మా ఆస్థానంలో ఒక విషశాస్త్ర నిపుణుడు ఉండేవాడు. మా దేశంలో పాము కాటు చావులు హెచ్చుగా ఉంటూ

ఉండేవి; అందుచేత నా తండ్రి ఆయనను కొలువులో ఉంచాడు. ఆయన ఒకసారి నా కొక మూలికను చూపి, దాని కాయలు అన్నంతోపాటు నమిలితే, మనిషి రెండు రోజులపాటు శవంలాగే ఉండి పోతా డని చెప్పాడు. తలవని తలంపుగా రాణిగారి ఉద్యానంలో నా కా మొక్క కనిపించింది. దాని కాయ ఒకటి కోసి, ఆదివారం ఉదయం అన్నంలో పెట్టుకు తిన్నాను. అన్నట్టు, ఇవాళ ఏం వారం?"

"ఇవాళ సోమవారం అనుకుంటాను," అన్నాడు రామపాలుడు.

''ఇకనేం? నాకు తిరిగి ప్రాణం వచ్చే సింది. మరి నీ కథ ఏమిటి, మిత్రమా?'' అని సాగరకుమారుడు అడిగాడు. రామ పాలుడు అతనికి తన వృత్తాంతం సంగ్రహంగా చెప్పాడు.

సాగరకుమారుడు చెప్పిన దాన్నిబట్టి, రాజకుమార్తె తనను పెళ్లాడ వచ్చిన వారిని ఇంద్రజాలం యుక్తితో వంచన చేసిందని రామపాలుడికి స్పష్టమయింది. రామపా లుడి ఆప్తమిత్రుడొకడు ఇంద్రజాలంలో ఆరితేరినవాడు. అతని నుంచి రామ పాలుడు సులభమైన ఇంద్రజాల విద్యలు అనేకం నేర్చుకున్నాడు. అందుచేత, రాజ కుమార్తె ప్రయోగించిన యుక్తి ఏమిటో అతను తెలుసుకుని, అదే ఇంద్రజాలంతో రాజకుమార్తెను ఓడించాలనుకున్నాడు.

రామపాలుడు తాను చేయదలచిన దంతా చెబితే, సాగరకుమారుడు, ''నువు





నీ యుక్తితో గెలిస్తే, రాజకుమార్తె చిత్తశుద్ధితో తన ఓటమి ఒప్పుకుంటుందని ఏమిటి? ఓడిపోయి కూడా ఆమె నిన్ను చెరసాలలో పెట్టిస్తే?'' అన్నాడు.

''అప్పుడు నువు నీ తండ్రి సేనలను తెచ్చి, నన్ను చెర విడిపించు. ఆ పని చెయ్యవా, మిత్రమా?'' అని రామపాలుడు అడిగాడు.

''ప్రమాణ పూర్తిగా చేస్తాను! నేను మారువేషంలో నగరంలో ఉండి కాగల దానికి వేచి ఉంటాను. నువు చేయదలచిన ఇంద్రజాలం చెయ్యి. మా తండ్రి రాజ్యం కూడా సమీపంలోనే ఉన్నది,'' అన్నాడు సాగరకుమారుడు.

మర్నాడు నగర ద్వారాలు తెరవగానే రామపాలుడూ, సాగరకుమారుడూ నగరంలో ప్రవేశించారు. సాగరకుమారుడు జుట్టు గొరిగేసి, రాలుపాలుడి వద్ద అదనంగా ఉండే బట్టలు ధరించి, తన రూపం మార్చుకున్నాడు.

ఒక ఆటబొమ్మల దుకాణంలో రామపాలుడు సాగరకుమారుడి సూచనపైన చిన్న పెట్టెనుకొని, అందులో ఒక నాణెం వేసి, దాన్ని తన ఎడమచేతి మణికట్టుకు కొంచెం ఎగువన కట్టుకుని, చొక్కా చెయ్యి దాని మీదికి లాగుకున్నాడు. అతను ఇప్పుడు ఎడమచెయ్యి ఆడిస్తే ధ్వని వినిపిస్తున్నది.

ఈ విధంగా తయారై రామపాలుడు రాజకుమార్తె వద్దకు వెళ్ళి, ఆమెను పెళ్ళాడగోరుతున్నట్టు తెలిపాడు.

''నన్ను గెలుచుకోవాలంటే, నేను పెట్టే పరీక్షలో నెగ్గాలి," అన్నది రాజకుమార్తె.

తాను ఏ షరతుకైనా సిద్ధంగా ఉన్నట్టు రామపాలుడు చెప్పాడు. ఓడితే అతను తన బానిసగా ఉండిపోవాలని ఆమె అతన్ని హెచ్చరించింది.

''దయచేసి నన్ను మీ దేవాలయానికి తీసుకుపోతే. నేను ఓడిపోతే నీకు దాసుడుగా ఉంటానని దేవుడి ఎదట ప్రమాణం

చేస్తాను. నేను గెలిస్తే నాకు భార్య అవు తాననీ, నియమభంగం చెయ్యాననీ నువు ప్రమాణం చెయ్యి.'' అన్నాడు రామ పాలుడు.

ఓడతానన్న సందేహం ఏ కోశానా లేక పోవటం చేత రాజకుమార్తె అందుకు ఒప్పుకుని, అతన్ని దేవాలయానికి తీసుకు పోయింది. పూజారి సమక్షంలో ఇద్దరూ ప్రమాణాలు చేశారు. పరీక్ష కూడా దేవా లయంలోనే జరిగింది.

రామపాలుడు పాత్రలో తన ఎడమ చెయ్యి పెట్టి, ఒక పెట్టె తీసి ఆడించాడు. అది ధ్వని చెయ్యటం చూసి రాజకుమార్తె నిర్ఘాంతపోయింది.

''నేను గెలిచాను, రాజకుమారీ. నన్ను పెళ్ళాడతావా? ప్రమాణం చేశావు.'' అన్నాడు రామపాలుడు.

రాజకుమార్తె తల వంచి తన అంగీ కారాన్ని తెలిపింది.

రామపాలుడు తన కుడిచేత్తో పాత్ర లోని రెండు పెట్టెలనూ తీసి ఆడించాడు. ఏదీ మోత చెయ్యలేదు. రెండూ నిజానికి ఖాళీవే. అతను రాజకుమార్తె ఎడమ చేతి మీది చొక్కాపైకి మడిచేసరికి, ఆమె మణికట్టు వద్ద కట్టి ఉన్న మరొకపెట్టె, నాణెం ఉన్నది, బయటపడింది.

"నువు ఇలా మోసం చేసి అందరినీ వంచించావు. మోసగత్తెవు!'' అన్నాడు రామపాలుడు.

''నేను మోసగత్తెను కాను. నా తండ్రి ఆజ్ఞ పాటించాను, అంతే! నన్ను ఓడించే పాటి తెలివితేటలు గలవాణ్ణి నిర్ణయించ టానికి నా తండ్రి చనిపోతూ నాకీ మార్గం తెలిపాడు. దేవుడే నిన్ను పంపాడు. నాకు సంతోషంగా ఉన్నది. నా తండ్రి ఆత్మ కూడా సంతోషిస్తుంది. ఇంతకాలమూ నాకు దాసులుగా ఉన్న వారి నందరినీ ఈ క్షణమే విడిచి పెడతాను. వారు అందరూ మన వివాహమహోత్సవంలో పాల్గొని, బహుమానాలు పుచ్చుకుని తమ ఇళ్ళకు తిరిగి పోతారు.'' అన్నది రాజ కుమార్తె.



# 157. కష్టసాధ్యమైన నౌకామార్గం

స్వీడన్‌దేశపు నైరృతి తీరాన గల ఈ నౌకామార్గం పర్వతమయమైన చిన్న చిన్న దీవుల మధ్యగా ఉన్నది. ఈ దీవులు అనాదిగా మానవులు నివసిస్తూ వచ్చినవి. ఇక్కడ అయిదువేల ఏళ్ళనాటి సమాధులున్నాయి; క్రీ. పూ. వెయ్యి ఏళ్ళనాటి (మూడువేల ఏళ్ళనాటి) లేఖనాలూ, చిత్తరువులూ శిలల మీద ఉన్నాయి. ఈ చిత్తరువులలో మనుషులూ, ఆయుధాలూ, నౌకలూ, మృగాలూ కనిపిస్తాయి. ఇప్పటికీ ఇక్కడి కొండల మీద పల్లెకార్ల గ్రామాలున్నాయి.






# అక్బర్ - జహాంగీర్

ఒక ఊళ్ళో సలీం అనే బీదయువకుడు ఉండేవాడు. అతనికి చిన్నప్పుడే తండ్రి పోవటం వల్ల తల్లే పెంచి పెద్ద చేసింది. పెరిగి పెద్ద వాడైన తరవాత సలీం ఒక వర్తకుడి వద్ద పనికి కుదురుకున్నాడు. అతని తల్లి అతనికి జహీదా అనే ఈడైన అమ్మాయిని చూసి పెళ్ళి చేసింది.

సలీంకు అతని యజమాని ఇచ్చే జీతం తిండికీ, బట్టకూ సరిపోయేది. కాని సలీం భార్య జహీదాకు జలతారు బట్టల మీదా, ముత్యాల నగల మీదా మోజు. భర్త సంపాదన తెలిసి కూడా, తనకు కావలిసిన బట్టలూ, నగలూ ఎలాగైనా తెమ్మని ఆమె సలీంను పోరేది.

ఒక రోజు సలీం నమాజ్ అనంతరం మేడ మీది వరండాలో కూర్చుని ఒక పెద్ద లోటాతో పాలు తాగుతున్నాడు. ఆ సమయంలో అతను తన భార్య కోరిక తీర్చటానికి డబ్బు ఎక్కడ తేవాలా అని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. అంతలో అతని చేతిలోని లోటా కాస్తా జారి కింద పడిపోయింది.

సలీం ఉంటున్న ఇంటి కిందనే ఒక దుకాణం ఉన్నది. ఆ దుకాణం ముందు ఒక తెల్లదొర నిలబడి దుకాణం యజమానిని ఏదో అడుగుతున్నాడు. సలీం చేతి నుంచి జారిన లోటా సరిగా దొరగారి టోపీ మీద పడింది. టోపీ ఉండటం చేత దొరకు పెద్దగా దెబ్బ తగలలేదు గాని, ఆయనకు కోపం వచ్చింది. ఆయన తరఫున దుకాణం వాడు సలీంను, నీకు బుద్ధిలేదా, కళ్ళు నెత్తికొచ్చినయ్యా అంటూ దుయ్యబట్టాడు.

దుకాణం దగ్గిర చిన్న గుంపు చేరింది. వాళ్ళలో ఉన్న ఒక సాయిబుగారు లోటాను అటూ ఇటూ తిప్పి చూసి,

ఎక్కడలేని ఆశ్చర్యంతో, "ఇది అక్బరు చక్రవర్తి లోటా! దీన్ని అయిదు వందల రూపాయలకు కొంటాను," అని సలీంతో అన్నాడు.

వెంటనే దొర తనకు జరిగిన అపచారం మరిచిపోయి, తాను ఆ లోటాను ఆరువందలకు కొంటానన్నాడు. సాయిబుగారూ, దొరగారూ ఈ విధంగా పోటీపడి క్షణాల మీద ఆ లోటా ధర పెంచారు. చివరకు దొరగారు దాన్ని ఏడువందల యాభైరూపాయలకు కొని పరమానందం చెందాడు.

సలీం తాతగారికి మిత్రుడైన ఒక పండుముసలి సాయిబుగారు ఇదంతా చూస్తూ ఉండి, అక్కడ చేరిన వారితో, సలీం కుటుంబం ఇప్పుడు సామాన్య దశలో ఉన్నప్పటికీ, ఒకప్పుడు మొగలాయీ రాజవంశాలతో సన్నిహితంగా ఉండేదనీ, వారింట్లో ఉండే పెద్ద అండా సాక్షాత్తూ జహంగీర్ పాదుషావారి దనీ చెప్పాడు.

దొరగారికి జహంగీర్ పాదుషాగారి అండా కూడా కొనెయ్యాలని కోరిక కలిగింది. ఆయనకు ప్రాచీన చరిత్ర ప్రసిద్ధి గల వస్తువులు సంపాదించటం సరదా.

సలీం అండాను దొరగారికి అమ్మటానికి ఒప్పుకుని, రెండువేల రూపాయలకు దాన్ని ఇచ్చేశాడు. దొరగారు అమూల్యమైన ప్రాచీన వస్తువులను చాలా తేలికలో సంపాదించానని తృప్తిపడ్డాడు. సలీం డబ్బు సమస్య అనుకోకుండా తీరిపోయింది.

అతను, ఆ డబ్బు తీసుకుపోయి బట్టలకూ, నగలకూ ఖర్చుపెట్టటం కంటె, అది పెట్టుబడి చేసి వ్యాపారం చేసుకోవటం మంచిదని భార్యకు చెప్పాడు. జహీదా ఒప్పుకున్నది. సలీం చేస్తున్నపని మానేసి, సొంతాన వ్యాపారం ప్రారంభించి, త్వరలోనే ఆ వూళ్ళో కెల్లా పెద్ద వర్తకుడయాడు. జహీదా కోరిన జలతారు బట్టలూ, ముత్యాల నగలూ కాలక్రమాన ఆమెకు లభించాయి.



"వెయ్యి వరహాల విలవైనమాట!" అన్నాడు మంత్రి.

"ఈ ముసలిది నన్ను చెయ్యమన్న పనే చేశాను. మొట్టికాయ కూడా పండు ఖరీదులో చేరిందనుకున్నాను. లేదని నాకెలా తెలుస్తుందీ?" అన్నాడు ఘటికుడు, మూడో ఆరోపణకు సమాధానంగా.

"లక్ష వరహాల విలవైనమాట!" అన్నాడు మంత్రి.

రాజుగారు ఘటికుడి మీది ఫిర్యాదులన్నీ కొట్టేసి, వాణ్ణి విడిచి పెట్టాడు. వాడు వెంటనే వెళ్ళిపోక, మంత్రి కేసి తిరిగి, "మాట అంటే మాటే! నా మాటల విలవ నాకు ఇప్పించండి అవతల పనుంది," అన్నాడు.

నిజమే, మంత్రి ఘటికుడికి నూరూ, వెయ్యీ, లక్ష వరహాలు బాకీ పడ్డాడు. రాజు ఘటికుడికి ఆ డబ్బు ఇప్పించాడు.

ఇంకొకడైతే ఆ డబ్బు తీసుకుని తన దారిన తానుపోయి ఉండును. కాని ఘటికుడు అలా వెళ్ళిపోయే ఘటం కాదు. వాడు తిన్నగా మంత్రిగారి ఇంటికి వెళ్ళి, తలవాకిలి వద్ద నిలబడి, దర్పంగా, "నాకు ఎవరైనా సుఖంగా భోజనం పెట్టితే ఈ డబ్బంతా ఇచ్చేస్తాను!" అని ప్రకటించాడు.

మంత్రికి అందకత్తె అయిన కూతురు ఉన్నది. ఆమెకు ఇష్టసఖి ఒకతె ఉన్నది. ఘటికుడి వద్ద ఉన్న ధనమంతా తన యజమానురాలికి దక్కాలన్న ఉద్దేశంతో



ఈ ఇష్టసఖి, ఘటికుణ్ణి పిలిచి భోజనం పెట్టమని మంత్రి కుమార్తెను ప్రేరేపించింది.

మంత్రి కుమార్తె అలాగేనని, ఘటికుణ్ణి లోపలికి ఆహ్వానించి, మంచిమంచి వంటకాలు చేయించి, వాణ్ణి ఆసనం మీద కూర్చోబెట్టి, తానే స్వయంగా వాడికి వడ్డించి, భోజనం చేయించి, తాంబూలం ఇచ్చింది.

ఘటికుడు తన డబ్బు యావత్తూ మంత్రి కుమార్తెకు ఇచ్చేసి, తిన్నగా మళ్ళీ రాజుగారి దర్బారుకు వెళ్ళి, రాజుకు నమస్కరించి, "మహారాజా, ఒక్క చిన్న సందేహం అడుగుతాను, క్షమించాలి," అన్నాడు.

రాజు మందహాసం చేసి, "అడుగు," అన్నాడు.

"ఒకడికి పీటవేసి కూర్చోబెట్టేది ఎవరు? స్నానం చేయించి, స్వయంగా వడ్డించి భోజనం పెట్టేది ఎవరు? వాడి డబ్బంతా తీసుకుని జాగ్రత్త పెట్టేది ఎవరు?" అని ఘటికుడు రాజును అడిగాడు.

"ఇంకెవరు? వాడి భార్యే! ఎందుకలా అడిగావు?" అన్నాడు రాజు ఎంతగానో ఆశ్చర్యపోతూ.

ఘటికుడు నవ్వి, "ఎందుకడిగానో, మంత్రిగారి కుమార్తెను అడిగి తెలుసుకోండి," అన్నాడు.

రాజు అంతా గ్రహించాడు. మంత్రి మండి పడ్డాడు. తన కుమార్తె డబ్బుకు ఆశపడి ఈ దుర్మార్గుడి వలలో పడిందని అయనకు అర్థమయింది. రాజు తన మంత్రిని ఊరడిస్తూ, "కుర్రవాడు చాలా చురుకైనవాడు. మీ అమ్మాయికి తగిన భర్తే అవుతాడు, సందేహంలేదు. వాళ్ళిద్దరికీ త్వరగా పెళ్ళి చేసెయ్యండి," అని సలహా ఇచ్చాడు.

ఘటికుడు మంత్రి కుమార్తెను పెళ్ళాడటమే గాక, రాజుగారి కొలువులో ఉపమంత్రి పదవి సంపాదించి, సుఖంగా జీవించాడు.





# చండభట్టు

పూర్వం ఒక రాజు వద్ద చండభట్టు అనే గారడీవాడు ఉండేవాడు. అతను చిన్న చిన్న గారడీలు చేసి ప్రజలను ఆశ్చర్య పరుస్తూ, తాను మాంత్రికుడినని చెప్పుకుని అనేక మోసాలు చేసేవాడు. చండభట్టు చేసే మోసాలలో మరొక ఆస్థాన ఉద్యోగి సహాయపడుతూ, లాభం పొందుతూ ఉండేవాడు.

ఇలా ఉండగా ఒకనాడు రాణి గ్రహణ స్నానానికని నదికి వెళ్ళి, తన నగలన్నీ తీసి నది ఒడ్డున ఉంచింది. ఆ సమయంలో అక్కడ పరిచారికలు తప్ప ఇంకెవరూ లేరు. రాణి స్నానం చేసి వచ్చేసరికి ఆమె నగలలో విలువగల హారం ఒకటి లేదు. అయితే రాణి పరిచారికలందరూ నమ్మకమైన వాళ్ళు, తన పుట్టింటి నుంచి అరణంగా వచ్చిన వాళ్ళు కూడానూ. అందుచేత రాణి వారిని హారం విషయం నిలవదీసి అడగటానికి సంకోచించింది.

కాని ఆమె రాజభవనానికి తిరిగి వెళ్ళి, రాజుతో జరిగిన సంగతి చెప్పింది. రాజు వెంటనే చండభట్టును పిలిపించి, హారం దొంగిలించినది ఎవరో కనుక్కోమన్నాడు.

చండభట్టు నవ్వి, "అదెంత పని, మహాప్రభూ? రేపీపాటికి దొంగను హారంతో సహా పట్టించే పూచీ నాది!'' అని చెప్పి, ఇంటికి వెళ్ళిపోయాడు.

చండభట్టు ఇల్లు చేరిన కొద్ది సేపటికి, అతని వద్దకు మాలిని అనే పరిచారిక పరిగెత్తుకుంటూ వచ్చి, చండభట్టు కాళ్ళ మీదపడి, ''అయ్యా, బుద్ధి గడ్డితిని రాణిగారి హారాన్ని నదీతీరాన నేనే దొంగిలించాను. ఇది మీదాకా వస్తుందనుకోలేదు. రేపు మీరు నన్ను దొంగ అని బయట పెడితే నా గతి ఏం కాను? దయ

వీరేపల్లి జయరాంరెడ్డి

చేసి నన్ను కాపాడండి. ఈ హారాన్ని మీరే తీసుకుని ఏదోవిధంగా రాణిగారికి చేరేటట్టు చూడండి. నా పేరు మాత్రం పైకి రానియ్యవద్దు. మీ మేలు ఈ జన్మలో మరవను," అంటూ హారాన్ని అతని చేతికి ఇచ్చింది.

చండభట్టు మాలినితో," భయపడకు. నిన్ను నేను కాపాడుతాను. కాని నువు నా దగ్గిరికి వచ్చినట్టు ఎవరితోనూ అనకు. అది నీకే ప్రమాదం," అని చెప్పి, ఆమెను పంపేశాడు.

ఆ హారాన్ని తానే కాజెయ్యాలని చండ భట్టుకు దుర్బుద్ధి పుట్టింది. అందుకు అతను ఒక చిన్నగారడీ చేశాడు; ఒక కాగితం మీద ఉల్లిపాయరసంతో, "హారం నదిలో కొట్టుకుపోయింది," అని రాసి, సభలో అందరి సమక్షంలో దానికి ధూపం వేశాడు. అక్షరాలు బయటపడ్డాయి. రాణిగారి హారాన్ని ఎవరూ దొంగిలించ లేదనీ, అది నదిలోపడి కొట్టుకు పోయిం దనీ అందరూ నమ్మారు.

మర్నాడు ఉదయం చండభట్టు తన మిత్రుడైన ఆస్థాన ఉద్యోగిని వెంట బెట్టుకుని, హారంతో సహా ఒక స్వర్ణకారుడి వద్దకు వెళ్ళి హారాన్ని చూపి దాన్ని అమ్మి పెట్టమన్నాడు. సరిగా అదేసమ యంలో మాలిని రాజభటులతో సహా అక్కడికి వచ్చింది. రాజభటులు చండ భట్టునూ, అతని తోడుదొంగనూ పట్టు కుని, ఆస్థానానికి తీసుకుపోయారు.

మాలిని నిండు సభలో రాజుతో, "మహారాజా, ఈ చండభట్టు పచ్చిమోస కారి. ఇతన్ని బయటపెట్టటం ఎలాగా అని ఆలోచిస్తున్నాను. చివరకు రాణిగారి హారం దొంగిలించటం ద్వారా ఇతని అసలు రంగు బయట పెట్టగలిగాను," అంటూ జరిగినదంతా చెప్పింది.

మాలిని తెలివితేటలకు రాజుతో బాటు సభికులందరూ ఆశ్చర్యపోయారు. రాజు ఆమెకు గొప్ప బహుమానం ఇచ్చి, చండ భట్టునూ, అతని అనుచరుణ్ణీ, దేశం నుంచి వెళ్ళగొట్టాడు.





# వీర హనుమాన్

రాముడు తనను రావణుడు ఉండే చోటు అడిగేసరికి, అతని బాధ చూసి తామ కూడా కన్నీరు కార్చుతూ సుగ్రీవుడు, ''రామా, ఆ రావణుడు ఎక్కడ ఉంటాడో నాకు తెలియదు. కాని ఒక్క ప్రతిజ్ఞ చెయ్యగలను; సీత నీకు తిరిగి దొరకటానికి అవసరమైన ప్రయత్నం చేస్తాను. నీకు సంతోషం కలిగిస్తాను. నువు ధైర్యంగా ఉండు. నేను కూడా నీ లాగే భార్యను పోగొట్టుకున్నాను. కాని ధైర్యాన్ని విడవలేదు,'' అన్నాడు.

సుగ్రీవుడు ఇలా ఊరడించేసరికి రాముడు కన్నీటితో తడిసిన తన ముఖాన్ని తుడుచుకున్నాడు. అతను సుగ్రీవుడితో, ''నిజమైన మిత్రుడి లాగా మాట్లాడావు. ఇప్పుడు నేనున్న స్థితిలో నీలాటి ఆప్తుడు దొరకటం దుర్లభం. నువు మాత్రం రావణుడు ఎక్కడ ఉంటాడో, సీతను ఎక్కడ ఉంచాడో వెతికించాలి. పోతే, నా నుంచి నీకు ఏం కావాలో చెప్పు, ఆ పని నా వల్ల అవుతుందా, కాదా అని సంశయించకు. నేను వాలిని చంపుతానన్న మాట యథార్థం. నేను ఇంతవరకు ఎన్నడూ అబద్ధం చెప్పలేదు, ఇక ముందు చెప్పను,'' అన్నాడు.

ఈ మాటలకు సుగ్రీవుడూ, అతని మంత్రులైన వానరులూ ఎంతో సంతోషించారు. సుగ్రీవుడు రాముడితో ఇలా అన్నాడు: ''రామా, నన్ను నా అన్న మోసం చేసి, నా భార్యను అపహరించాడు. నాకు

**4. వాలి సుగ్రీవుల యుద్ధం**



ఎంతకాలం జీవించేది! వాలి చస్తేనే గాని నాకు క్షేమం లేదు.''

రాముడు ఈ మాటలకు నవ్వి, ''నా ఒక్క బాణంతో వాలిని చంప గలను. నా కంటపడిన మరుక్షణం అతను చచ్చిపోతాడు. నువు కూడా నేనున్నస్థితి లోనే ఉన్నావు, సందేహంలేదు. నీదుఃఖం త్వరలోనే తీరిపోతుంది. ధైర్యం వహించు,'' అన్నాడు.

సుగ్రీవుడు రాముడికి వాలి బలసత్వా లను గురించి ఇలా చెప్పాడు: వాలి తెల్ల వారకముందే లేచి, సూర్యోదయం అయే లోపల నాలుగు సముద్రాలలోనూ స్నానం చేసి, సంధ్యావందనం చేస్తాడు; పర్వత శిఖరాల మీదికి ఎక్కి, పెద్ద పెద్ద కొండ రాళ్ళను బంతుల్లాగా ఎగరవేసి పట్టుకుం టాడు; అరణ్యాలలో పెద్ద పెద్ద చెట్లను విరిచి తన బలం చూసుకుంటాడు; వెయ్యి ఏనుగుల బలంగల దుందుభి అనేవాణ్ణి చంపాడు.

దుందుభి ఎనుబోతు రూపంగల రాక్ష సుడు. వాడు మదగర్వంతో మొట్టమొదట సముద్రుడి వద్దకు వెళ్ళి, తనతో ద్వంద్వ యుద్ధానికి రమ్మన్నాడు.

సముద్రుడు వాడితో, ''నాయనా, నీతో యుద్ధం చేసే శక్తి నాకు లేదు. అందుకు సమర్థుడు హిమవంతుడు. అతనితో

ఏం చెయ్యాలో తెలియదు. ఇలా బతుకు తున్నాను. బలవంతుడైన వాలి నన్ను రాజ్యభ్రష్టుణ్ణి చెయ్యటమే గాక, నన్ను చంపించటానికి అనేక ప్రయత్నాలు చేశాడు. అతను నా మీదికి పంపిన వాన రులను ఎంతోమందిని నేను చంపాను. నేను నా అన్న భయం చేతనే నీ దగ్గిరికి కూడా రాలేదు. నాకిప్పుడు ఈ హను మంతుడు మొదలైన వారు ఎంతో సహా యంగా ఉన్నారు. నా పట్ల స్నేహం కలిగి వాళ్ళు నన్ను రక్షిస్తున్నారు. నేను ఎక్క డికి పోతే అక్కడికి వస్తారు. నన్ను ఎల్లప్పుడూ రక్షిస్తూ ఉంటారు. ఇలా ప్రాణభయంతో, యీ పర్వతం మీద

యుద్ధం చేస్తివా, నీ భుజాల తీట తీరు తుంది. కనక వెంటనే బయలుదేరి అక్కడికి పో," అని చెప్పాడు.

సముద్రుడు తనను చూసి భయపడ్డాడని సంతోషించి, దుందుభి శరవేగంతో హిమాలయానికి వెళ్ళి, ఏనుగులంతేసి కొండరాళ్ళను తన కొమ్ములతో విసిరేస్తూ, గర్జించాడు.

ఇది తెలిసి హిమవంతుడు ఒక కొండ శిఖరం మీదికి వచ్చి నిలబడి, "దుందుభీ, నన్ను యుద్ధంతో ఎందుకు బాధిస్తావు? నేను యుద్ధం చెయ్యటానికి పనికి రాను. ఇక్కడ ఎందరో మునులు తపస్సు చేసుకుంటున్నారు. ఇది యుద్ధం చేసే స్థలం కాదు," అన్నాడు.

దుందుభి మహా కోపంతో, "యుద్ధం చెయ్యటం నీకు చేతగాకపోతే చేతనైనవాడెవడో చెప్పు. వాణ్ణి క్షణాల మీద చంపి, నా శక్తి చూపుతాను," అన్నాడు.

"నీకు యుద్ధమే కావాలంటే కిష్కింధలో ఉండే వాలి వద్దకు వెళ్ళు. అతన్ని గెలవటం అసాధ్యం," అని హిమవంతుడు చెప్పాడు.

దుందుభి కిష్కింధానగర ద్వారం వద్దకు వచ్చి, గొప్ప గర్జన చేశాడు. వాడు అక్కడ ఉన్న చెట్లను విరుస్తూ, తన గిట్టలతో నేలను గీరుతూ, కొమ్ములతో



నగర ద్వారాన్ని కొడుతూ అర్భాటం చేయటం వాలి విన్నాడు. అతను అంతఃపురం నుంచి స్త్రీజనాన్ని వెంట బెట్టుకుని దుందుభి వద్దకు వచ్చి, "ఒరే దుందుభీ, నేను నిన్ను ఎరుగుదును. ఎందుకిలా గర్జిస్తున్నావు? ప్రాణాల మీద ఆశలేదా?" అని అడిగాడు.

ఈ మాటలకు దుందుభి మండిపడి, "ఆడవాళ్ళ ముందు ప్రగల్భాలాడితే కాదు, నాతో యుద్ధం చేసి, నీ శక్తి చూపించు. లేదా, రేపు పొద్దుటి దాకా నీకు గడువు ఇస్తున్నాను. అనుభవించవలసిన సుఖాలన్నీ ఈ రాత్రి అనుభవించు. నీ బంధువు లందరికీ ఇచ్చేసేది



ఇచ్చెయ్యి; మిత్రులతో చెప్పుకునేదంతా చెప్పుకో; నీ నగరమంతా ఒక్కసారి చూసుకో; నీ బదులు మరొకణ్ణి రాజుగా నియమించు. అప్పుడు నేను నీ మదం అణగిస్తాను,'' అన్నాడు.

వాలి స్త్రీజనాన్ని అంతఃపురానికి తిప్పి పంపి, దేవేంద్రుడు తన కిచ్చిన కాంచన మాలను మెడలో వేసుకుని, దుందుభి మీద కలియబడి, వాడి కొమ్ములు పట్టుకుని గిరగిరా తిప్పి, నేల కేసి కొట్టి, సింహనాదం చేశాడు. దుందుభి చెవుల నుంచి రక్తం వచ్చింది.

అయినా వాళ్ళిద్దరూ చాలాసేపు పిడికిళ్ళతోనూ, మోకాళ్ళతోనూ, రాళ్లతోనూ, చెట్లతోనూ యుద్ధం చేశారు. క్రమంగా దుందుభి బలం క్షీణించి, వాలి బలం పెరిగింది. అది చూసి వాలి దుందుభిని పైకెత్తి, నేల కేసి కొట్టి చంపేశాడు. తరవాత అతను దుందుభి కళేబరాన్ని ఎత్తి, ఊపి, ఆమడదూరం పోయి పడేటట్టు విసిరి వేశాడు. నోటి నుండి రక్తం కారుతున్న ఆ కళేబరం మతంగముని ఆశ్రమం మీదుగా వెళ్ళి పడింది. దాని తాకిడికి ఆశ్రమప్రాంతంలోని కొన్ని చెట్లు విరిగాయి.

ఆశ్రమంలో రక్తపు మరకలు చూసి, మతంగమహాముని కోపించి, అందుకు కారకుడు వాలి అని తెలుసుకుని, వాలి తన ఆశ్రమానికి ఆమడదూరంలో అడుగు పెడితే చస్తాడని శాపం పెట్టి, వాలి భృత్యులనందరినీ తన వనం నుంచి వెళ్లగొట్టాడు; ఒక్క రోజు లోపల వెళ్లిపోని వాళ్ళు శిలలైపోతారన్నాడు.

తన వద్దకు తిరిగి వచ్చిన భృత్యులను చూసి వాలి, ''మీ రందరూ తిరిగి వచ్చారేం? వానరులకు ప్రమాదం ఏదీ కలగలేదు గద?'' అని అడిగాడు. వాళ్ళు జరిగినదంతా చెప్పారు. వాలి మతంగమహామునిని శాపం ఉపసంహరించమని వేడుకున్నాడు. కాని ఆయన వినిపించుకోలేదు. అది మొదలు వాలి ఋశ్యమూక

పర్వతం కేసి చూడటం కూడా మానేశాడు. ఈ శాపం ఆపదసమయంలో సుగ్రీవుడికి లాభించింది. అతను తన మంత్రులతో ఋశ్యమూకం మీద నిర్భయంగా ఉంటున్నాడు.

సుగ్రీవుడు రాముడికి వాలిని గురించి ఇదంతా చెప్పి, రాముడికి దుందుభి కళేబరాన్ని చూపించి, "ఈ లావుపాటి మద్దిచెట్లు ఇక్కడ ఏడు ఉన్నాయి చూడు; వీటిలో దేనినుంచి అయినా దూసుకుపోయేటట్టు బాణం వేసేపాటి బలం వాలికి ఉన్నది. అలాంటి బలశాలిని యుద్ధంలో ఏ విధంగా చంపుతావు?" అని అడిగాడు

ఈ మాటకు లక్ష్మణుడు నవ్వి, "ఇతను ఏం చేస్తే, వాలిని చంపగలడన్న నమ్మకం నీకు కుదురుతుంది?" అని అడిగాడు.

"రాముడు కూడా మద్దిచెట్టు నుంచి దూరి పోయేటట్టు బాణం కొట్టి, బాణంతో ఈ దుందుభి కళేబరాన్ని రెండు వందల బారల దూరం పోయిపడేటట్టు కొట్టితే, ఇతను వాలిని చంపగలడని నమ్ముతాను," అని సుగ్రీవుడు లక్ష్మణుడితో అన్నాడు.

అతను రాముడి కేసి తిరిగి, "రామా, వాలి మహాబలశాలి. అతను ఇంతవరకూ



అపజయం ఎరగడు. అతని బలం నాకు తెలుసు, కాని నీ బలం నాకు తెలియదు. అందుచేత, నిన్ను భయపెట్టటానికి నేనీ మాటలు చెప్పటం లేదు: వాలి అంటే నాకున్నభయం కొద్దీ చెబుతున్నాను," అన్నాడు.

రాముడు చిరునవ్వు నవ్వి. "నా పరాక్రమంలో నీకు నమ్మకం కలిగేటట్టు నేను చేస్తాను," అని. దుందుభి కళేబరాన్ని కాలి బొటనవేలితో ఎత్తి, పది ఆమడల దూరం పోయి పడేటట్టు విసిరాడు.

అది చూసిన సుగ్రీవుడు, "రామా, ఇప్పుడా కళేబరం ఎండి, తేలిక అయి



పోయింది. దుందుభితో భయంకరంగా యుద్ధం చేసి అలసిపోయి ఉన్న సమయంలో వాలి పచ్చికళేబరాన్ని ఇంత దూరం విసిరాడు. అందుచేత, నీకూ, వాలికీ బలంలో గల తేడాగురించి నా సందేహం తీరలేదు. ఒక్క మద్ది చెట్టు కుండా దూసుకుపోయేటట్టు బాణం వేశావంటే, మీ ఇద్దరి బలాబలాలు నాకు తెలుస్తాయి,'' అన్నాడు.

సుగ్రీవుడికి తన యందు నమ్మకం కలగ గలందులకు రాముడు ధనుస్సు చేత బట్టుకుని, ఒక బాణం తీసుకుని మద్దిచెట్టును కొట్టాడు. ఆ బాణం ఏడు మద్ది చెట్లనూ దూసుకుని పోయి, కొండను భేదించి, భూమిలోకి వెళ్ళి పోయింది. అది చూసి సుగ్రీవుడు నిర్ఘాంత పోయాడు. అతను చేతులు జోడించి, రాముడి ముందు సాష్టాంగ నమస్కారం చేసి, ''రామా, నువు ఇంద్రుణ్ణీ, దేవతలనూ కూడా జయించ గలవు; వాలిని చంప గలవనటానికి సందేహం లేదు. నీ స్నేహం కలిగినందుకు నేనెంతో సంతోషిస్తున్నాను,'' అన్నాడు.

రాముడు సుగ్రీవుణ్ణి కౌగలించుకుని, లక్ష్మణుడితో సంప్రదించి, ''సుగ్రీవా, మనం బయలుదేరి కిష్కింధకు పోదాం. నువు మా కన్న కొంచెముందుగా వెళ్ళి, వాలిని యుద్ధానికి పిలు,'' అన్నాడు.

వెంటనే రామలక్ష్మణులూ, సుగ్రీవుడి అనుచరులూ కిష్కింధకు వెళ్ళి, నగరం వెలపల ఉన్న వనంలో చెట్ల చాటున దాక్కున్నారు.

సుగ్రీవుడు దట్టి గట్టిగా బిగించి, వాలిని పిలవటానికి భయంకరమైన గర్జనలు చేశాడు. తన తమ్ముడి పిలుపు విని కోపించి, వాలి వచ్చాడు. ఇద్దరూ దారుణంగా యుద్ధం చేశారు; ఒకరి నొకరు పిడికిళ్ళతోనూ, అరచేతులతోనూ కొట్టుకున్నారు, పట్టుకున్నారు.

వారిద్దరూ ఒకేపోలికగా ఉండటం చేత రాముడికి, వారిలో ఎవరు సుగ్రీవుడో,

ఎవరు వాలో తెలియరాలేదు. అందుచేత అతను బాణం వదలలేక పోయాడు. ఈ లోపల సుగ్రీవుడు ఓడిపోయి పారి పోసాగాడు.

వాలి అతన్ని మతంగమహాముని ఆశ్రమం దాకా వెంటబడి తరిమి, సుగ్రీవుడు నెత్తురు ఓడుతూ మతంగాశ్రమం ప్రవేశించగానే, ''బతికి పోయావు పో!'' అని కిష్కింధకు తిరిగివెళ్ళాడు.

రాముడు హనుమంతుణ్ణీ, లక్ష్మణుణ్ణీ వెంట బెట్టుకుని తాను కూడా సుగ్రీవుడి వెనక వెళ్ళాడు. సుగ్రీవుడు రాముణ్ణి చూసి తల వంచుకుని, ''నీ పరాక్రమం చూపినవాడివి, నన్ను వాలి పైకి యుద్ధానికి పంపి, వాలి చేత చావుదెబ్బలు తినిపించావే, ఇదేం పని? వాలిని చంపటం నీకు చేతగాదని ముందే చెబితే నేను వెళ్ళనే వెళ్ళను గద!'' అని దీనంగా అన్నాడు.

''సుగ్రీవా, నేను వాలిని కొట్టక పోవటానికి కారణం చెబుతాను విను. మీ ఇద్దరి అలంకరణలూ, రూపాలూ, నడకా, కంఠధ్వనీ, కళ్ళూ, శరీరచ్ఛాయా ఒకేవిధంగా ఉన్నాయి. మీ ఇద్దరిలో నాకు కొంచెం కూడా తేడా తెలియరాలేదు. మొదటికే మోసంవస్తుందని నేను బాణం విడవలేదు. నీకు అభయం ఇచ్చినవాణ్ణి భ్రమపడి నీ ప్రాణమే తీస్తే అది మహా పాపం కదా? నేనూ, లక్ష్మణుడూ, సీతా కూడా నీ అధీనంలో ఉన్నవాళ్ళం. నన్ను గురించి సందేహించక, నువు మళ్ళీ వెళ్ళి వాలితో యుద్ధం చెయ్యి. ఈసారి నాకు గుర్తుగా ఉండేటందుకు ఏదైనా ధరించు. ఒకే ఒక్క బాణంతో వాలిని చంపుతాను. లక్ష్మణా, పూసి ఉన్న ఈ గజపుష్పిని తెంపి, సుగ్రీవుడి మెడకు చుట్టు,'' అన్నాడు రాముడు.

సుగ్రీవుడికి రాముడి మాటలలో యీసారి గట్టి నమ్మకం కుదిరింది. అతను ఎంతో ఉత్సాహంగా గజపుష్పి మెడకు చుట్టుకుని, మళ్ళీ కిష్కింధకు బయలు దేరాడు.





# అమరవాణి

రిపూణాం ధర్షణం శూరా
మర్షయంతి న సంయుగే,
జానన్తస్తు స్వకం వీర్యం
స్త్రీసమక్షం విశేషతః. 1

[శూరులు యుద్ధంలో శత్రువుల తిరస్కారాన్ని సహించరు. అందులోనూ శత్రువు కన్న తమ బలం హెచ్చని తెలిసినవాళ్ళు, మీదు మిక్కిలి స్త్రీల సమక్షంలో అసలు సహించరు.]

అధర్షితానాం శూరాణాం,
సమరే ష్వనివర్తినాం,
ధర్షణామర్షణం (భీరు!)
మరణా దతిరిచ్యతే. 2

[యుద్ధంలో వెనుదీయని శూరులకు, ఎవరన్నా ఎదిరించినప్పుడు సహించి ఊరుకోవటం మరణం కన్న ఎక్కువైనది.]

శూరాణాం హి మనుష్యాణాం
త్వద్విధానం మహాత్మనాం
వినష్టే వా, ప్రణష్టే వా
శోక స్సర్వార్థనాశనః. 3

[శూరులూ, మహాత్ములూ అయినవాళ్ళు కనపడని దాన్ని గురించి గాని, నశించిన దాన్ని గురించి గాని దుఃఖించటం అన్నివిధాలా చేటు.] —వాల్మీకి

Photo by Nellai A. Ganapathy



బహుమతి
పొందిన వ్యాఖ్య

గడులు మీకు

పంపినవారు :
యం. హరిహరప్రసాద్

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు జనవరి 20వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైనమాత్రమే రాయాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు మార్చి నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
ఆహార్యం

మూడవ అట్ట:
ఆంగికం

**Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd.,**

# సరిగ్గా ఆడాడు...

























ఫోర్‌హ్యాన్స్

దంతవైద్యునిచే సృష్టించబడిన టూత్ పేస్ట్

